28-8-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :35 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



## చెన్నారెడ్డిని గవర్నర్‌గా వుంచడం ధర్మమా!

రాష్ట్ర రాజకీయాలలో చెన్నారెడ్డిది ఒక విలక్షణ వైఖరి. ఆయన ఎప్పుడు ఎందుకు ఎట్లా ప్రవర్తిస్తారో కనిపెట్టడం ఆ బ్రహ్మతరం కూడా కాదు. తనకు వచ్చిన పదవి, తను కోరుకున్న రీతిలో విచ్ఛిన్నం చేసి పారేయడం; తానువెప్పదలుచుకొన్న అభిప్రాయాన్ని నిష్కర్షయంగా, కుండ బద్దలు కొట్టినట్లు చెప్పడం, తను కోరుకున్న పదవిపై తనకున్న మక్కువను నిస్సిగ్గుగా వ్యక్తంచేయడం ఆయన నైజం.

చెన్నారెడ్డిగారి కిప్పుడు తిరిగి ముఖ్యమంత్రి పదవిపై ఎక్కడ లేని మోజు కలిగినట్లుంది. జనార్దనరెడ్డిపై అసమ్మతి యుద్ధప్రకటన జరిగిందన్న వార్త చెవినపడడంతో, ఒక్క క్షణం జైపూర్‌లో నిలువ లేకపోయారు. రాజస్థాన్ ప్రభుత్వ విమానమెక్కి, ఆఘమేఘాల మీద హైదరాబాదులో వాలిపోయారు. వస్తూవస్తూ గవర్నర్ గిరిని పరిత్యజించి వచ్చివుంటే బాగుండేది. చెన్నారెడ్డి గారికి గవర్నర్ పదవి అంటే వైముఖ్యం వుంది కాని, అంతకంటే పెద్ద పదవి వచ్చినంత వరకు దీనిని వదలుకొనే ఉదారత్వం మాత్రం లేదు. ఆ పదవిలోని రాజభోగాలు, మందిమార్బలాల సేవలు, రాచరికపు మర్యాదలు ఆయన మనసును పీకుతూనే వుంటాయి. ఇంటిదాకా వెళ్లే వరకు ఆగితే సిఎం కుర్చీకి తన కంటే ముందు మరొకరు క్యూలో నిలబడతారనే భయంతో కాబోలు, విమానాశ్రయంలోనే, గవర్నరు హోదాలోనే పత్రికల వారి దగ్గర రాష్ట్ర రాజకీయాలలో తన పునఃప్రవేశోత్సుకతను వ్యక్తం చేశారు. తాను గవర్నరు హోదాలో వున్నానన్న సంగతి మర్చిపోయి, సాదాసీదా అసమ్మతి నాయకుడివలె మాట్లాడేశారు. తన గ్రూపు బాగా పెద్దదైందని, నల్గురు మంత్రులుగా వున్న సంఖ్య పెరిగిందని, రాష్ట్ర రాజకీయ మార్పులపై తన అనుచరులతో చర్చ జరపబోతున్నానని ప్రకటించారు చెన్నారెడ్డి.

విమానాశ్రయంలో ఆయనకు జరిగిన స్వాగత సత్కారాల తీరుకూడా ఆయన రాజకీయాభిలాషను వ్యక్తంచేసింది. జనార్దనరెడ్డికి వ్యతిరేకంగా చెన్నారెడ్డి , వైఎస్‌రాజశేఖరరెడ్డి వర్గాల ఏకీకరణకు సూచనా అన్నట్లు డాక్టర్ డిఎల్ రవీంద్రరెడ్డి వంటి వారు ఎయిర్‌పోర్టుకు వచ్చి చెన్నారెడ్డిని స్వాగతించారు. ఇల్లు చేరిన దగ్గర నుంచి చెన్నారెడ్డికి క్షణం తీరిక లేదు.వైఎస్ వర్గంతో, తన అనుకూల మంత్రులతో ఎడతెరిపిలేని చర్చలు జరుపుతున్నారు. గురువారం (27తేది) రాత్రి శ్రీమతి ఉమావెంకట్రామరెడ్డి ఇంట్లో విందు సమావేశం జరిగింది. మొదటి సారిగా అక్కడ వైఎస్‌ను స్వయంగా కలిశారు జోరుగా రాజకీయ చర్చలు జరిగాయి.

70 ఏళ్లు దాటిన వయస్సులో, ఆరోగ్యం క్షీణించి, మృత్యువుకు సన్నిహితమై, భగవత్కృప వల్ల పునర్జన్మ పొందిన తర్వాత, ఇంకా పదవీ తమకం తీరక పోవడం ఏమిటన్న సంగతి ప్రక్కన పెడితే; ఒక బాధ్యత కల్గిన గవర్నర్‌గా తాను ఇటువంటి రాజకీయ కార్యకలాపాలలో మునిగి తేలవచ్చా, ఇట్లా మాట్లాడవచ్చా అని ఆయన ఒక్క క్షణం సైతం ఆలోచించక పోవడమే విస్మయ పడాల్సిన విషయం. చెన్నారెడ్డి వంటి అసాధారణ మేధావికి, యాభై ఏళ్ల రాజకీయానుభవం కల్గిన వాడికి గవర్నర్ విధులు, బాధ్యతలు ఇంకొకరు విడమరచి చెప్పనవసరం లేదు. తెలిసీ, ఆ పదవి హుందాతనాన్ని విచ్ఛిన్నం చేస్తూ మంట గల్పుతున్న వ్యక్తిని గవర్నర్ పదవిలో కొనసాగించడం ధర్మమా అని ఆలోచించాలి. ఆ ఆలోచన చేయాల్సింది హై కమాండు. అయితే ఖాళీగా పెడితే ప్రమాదమన్న ఉద్దేశ్యంతో చెన్నారెడ్డిని ఇటు హైదరాబాదు, అటు ఢిల్లీలకు దూరంగా జైపూర్‌కు పంపింది ఆ హై కమాండే! గవర్నర్ పదవి ప్రతిష్ఠ నిలపడం కోసం ఆ ప్రమాదాన్ని వారు కొని తెచ్చుకుంటారని ఎవరూ భావించలేరు.

## ప్రధాని ఏం చెప్తాడో!

రేపు నగరానికి రానున్న ప్రధానమంత్రి పివి నరసింహారావు చెప్పే మాటలు, చేసే వ్యాఖ్యలపై రాష్ట్ర రాజకీయ భవితవ్యం ఆధారపడి వుంది. మంత్రుల రాజీనామాలు తిరస్కరిస్తూ, 29 తేది తాను హైదరాబాదుకు వచ్చినంత వరకు ఎవరూ, ఏదీ మాట్లాడ వద్దని ఆదేశించి వున్నాడాయన. అందువల్లే ఇటు సమ్మతి, అటు అసమ్మతి వర్గీయులు ఇద్దరూ ఆయన రాక కోసం చకోర పక్షులై ఎదురు చూస్తున్నారు. ఇరు పక్షాలూ ప్రధాని మొగ్గు తమ వైపేనని ఆశపడుతున్నాయి. కర్ర విరగకుండా, పాము చావకుండా సమస్యను నానవేయడంలో పివి అఖండ మేధావి. ఈ సమస్య సైతం అట్లే వాయిదా పడ వచ్చున్నది పరిశీలకుల అభిప్రాయం. తనకు జరిగే ప్రమాదం ఏదీ లేదన్న ధీమా ముఖ్యమంత్రిలో కూడా వ్యక్తమౌతున్నది!

## తొలి ఉద్వాసన చిత్తరంజన్?

ప్రధాన పర్యటన తర్వాత ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి తనపై తిరుగుబాటు చేసిన మంత్రుల భరతం పట్టారని వార్త. చాలాకాలం నుంచి వాయిదా పడుతూ వస్తున్న మంత్రి వర్గ విస్తరణ ఈ ప్రయత్నానికి ఉపకరించ వచ్చు. ఒక్కసారిగా రాజీనామా చేసిన మంత్రులందరినీ తొలగించి సంక్షోభం సృష్టించే కంటే, తనను ధిక్కరించిన వారికి ఏమి జరుగుతుందో తెలియజెప్పడానికి ఒకరు లేదా ఇద్దరు మంత్రులను మాత్రం ఊడబెరక తారని చెప్తున్నారు. ఉద్వాసనాయత్నంలో తొలిగా రాలిపోయే తిరుగుబాటు వీరుడు చిత్తరంజన్ దాస్ అని తెలుస్తుంది! ఒక టెస్ట్ డోస్ మాదిరి ఈ ఉద్వాసనాస్త్రాన్ని ప్రయోగిస్తే తక్కిన మంత్రులు పశ్చాత్తాపపడి తప్పు తెలుసుకుంటారన్నది ముఖ్యమంత్రి ఆలోచన అంటారు.

చిత్తరంజన్ దాస్‌ను తొలి బలికి ఎంపిక చేయడంలోనూ పరమార్థం వుంది. కేంద్ర మంత్రి సమక్షంలో, బహిరంగ సభలో తాను మంత్రి వర్గంలో లేనట్లే లెక్కని ప్రకటించిన వాడిని తొలగిస్తే హై కమాండు నుంచి పెద్దగా ప్రతిఘటన ఎదురు కాదు; రాష్ట్రం వరకు చిత్తరంజన్‌దాస్ ఏ ప్రధాన వర్గానికి చెందిన వ్యక్తి కాదు. అందువల్ల అసమ్మతి నాయకులూ సానుభూతి ప్రకటనలు చేయడం తప్ప, సీరియస్‌గా ప్రతిస్పందించే అవకాశం తక్కువ.

అసెంబ్లీ జరిగే సమయంలో మంత్రివర్గం మార్పులు తలపెట్ట వచ్చాఅన్నది ఒక ప్రశ్న. ముఖ్యమంత్రినే మార్చిన సంఘటనలు వున్నప్పుడు ఇది పెద్ద అవరోధం కాబోదు. ఏదో ఒక తీవ్ర

కొరవ 7పేజిలో

## కాలేజీలు వుండి తీర్తాయి!

మెడికల్ కాలేజీల మంజూరుపై ప్రతిపక్షాలు రభస సృష్టించే కొద్దీ ముఖ్యమంత్రి పట్టుదల పెరిగి పోతున్నది. ఆరునూరైనా, నూరు ఆరైనా కాలేజీలు నడిపి తీరాలన్న పంతానికి వచ్చారాయన. అసెంబ్లీలో ఈ సమస్యను ప్రధానం చేసి, బడ్జెట్‌పై చర్చ జరగనివ్వకుండా నిలువరించి, ప్రజల దృష్టిని ఆకర్షించడంలో తెలుగుదేశం నాయకులు సఫలీకృతులైనారు. అసెంబ్లీ బయట జరుగుతున్న ఉద్యమంలో కూడా బిజెపి, కమ్యూనిస్టు వంటి ప్రతిపక్షాలను వెనుకకునెట్టి, ఎన్టీఆర్ పెద్దల్లుడు డాక్టర్ డి. వెంకటేశ్వర రావు నాయకత్వం పగ్గాలు చేతపట్టుకో గల్గాడు. మెడికల్ విద్యార్థులు ఆయన నాయకత్వాన్ని అంగీకరించినట్లే కన్పడుతూంది. ముఖ్యమంత్రి కోరిక పైన 29 తేది బంద్‌ను వాయిదా వేయడానికి కమ్యూనిస్టులు మెత్తబడినా, వెంకటేశ్వర రావు పట్టుదలే నెగ్గింది. అయితే అసెంబ్లీలో, బయట ఎంత ఒత్తిడి వస్తున్నప్పటికీ ముఖ్యమంత్రి తలొంచడం లేదు. నిపుణుల కమిటీ నివేదికను వెల్లడి చేయడానికి సైతం అంగీకరించలేదు. ఇంకొక ప్రక్క హై కోర్టులో కేసు పై వాదోపవాదాలు కొనసాగుతున్నాయి. అసెంబ్లీకి ఇవ్వ నిరాకరించిన నిపుణుల నివేదికను న్యాయమూర్తులకు ఇవ్వక తప్పలేదు.

మెడికల్ కాలేజీల మంజూరులో తన ఉద్దేశ్యాలు నిజాయితీతో కూడినవని జనార్దన రెడ్డి అభిప్రాయం. కాలేజీల ఏర్పాటు వల్ల విద్యార్థులకు కాని, రాష్ట్రాని...

కొరవ 7 పేజి

# పినాకిని తీరం

## "కల్లోళ సభంట"!

నెల్లూరులో ఏదైనా సభో సన్మానమో జరిగేట్లుంటేనో, లేక ఎవరైనా ప్రముఖ నాయకుడు వచ్చేట్లుంటేనో అటువంటి వార్తను ఆ చివరి నుండి ఈ చివరి వరకు టవున్ మధ్యగా పోయే ట్రంకురోడ్డే చెప్తుంది. స్వాగత ద్వారాల నిర్మాణానికి, తోరణాల అలంకరణకు, విద్యుద్దీపాల శోభకు సిద్ధంగా వున్న తారు రోడ్డును విచ్చంకోచంగా, నిర్దాక్షిణ్యంగా త్రవ్వివేయటం అలవాటై పోయింది. పెద్ద సభే కాదు. పెద్ద నాయకులే కాదు. కొత్తగా ఏమి జరుగుతున్నా. ఆఖరుకు ఫైనాన్స్ కార్పొరేషన్ వారి కార్గ తిరుపతి విజయయాత్ర వంటి ప్రజలకు సంబంధించని సందర్భాలలో సైతం ప్రధానమైన ఈ రోడ్డు గడ్డపార గాయాలకు గురి కావలసిందే! ఎన్ని ఆర్చీలు ఎక్కువ కట్టగలిగితే, ఎంత ఆర్భాటం చేయగలిగితే అంత గొప్ప కార్యక్రమం క్రింద లెక్క – ప్రజలకు కాదు, నిర్వాహకులకు! పౌరులకు వీటిపట్ల ఎంత నీరస భావముందో, చులకన అభిప్రాయం వుందో అది వేరే సంగతి!

మొన్న మంగళ వారం అదే విధంగా పొడ కొయ్యలు ప్రక్కన పెట్టుకొని కూలీలు రోడ్డు మీద గుంటలు త్రవ్వుతున్నారు. దారిన పొయ్యేవాణ్ణి పోకుండా, ఏమిటి విశేషం అని ఆ శ్రామికుణ్ణి అడిగాను. అతను తడుదు కోకుండా అమాయకంగా సమాధానం చెప్పేశారు – "ఏదో కల్లోళ సభంట సామి" అని! అది జిల్లా గౌడ మహాసభ అని అతనికి తెలియదు; దానికి ఎవరెవరొచ్చేదీ అతనికి తెలియదు; ఎందు కోసమైందీ వారికి తెలియదు; కల్లుకింగు కాదు, సారాయి సామ్రాట్ శ్రీ రావుల అంకయ్య గౌడ్ సొంత సభ అని కూడా తెలియదు; అతనికి తెలిసినదంతా ఒకటే. చెప్పిన పని చేయడం, సాయంత్రం కూలి డబ్బులు చేతిలో వేసుకొని పోవడం – అంతవరకే!

ఆ కూలి వ్యక్తి ఏదో కల్లోళ సభ అన్నప్పుడు, నా మొద్దు తలకు వెంటనే అర్థం కాలేదు; తర్వాత గ్రహింపుకు వచ్చింది. అప్పుడనుకున్నాను, అతనెంత కరెక్టుగా చెప్పాడా అని! గౌడులను మన ప్రాంతంలో గమళ్ల వాళ్లంటారు. గమళ్ల వాళ్లంటే కల్లుగీసే వారని అందరికీ తెలిసిందే. వీరినే కల్లు గీత కార్మికులని కూడా అంటారు. ఇన్ని వివరణలు లేకుండా ఆ వ్యక్తి, తేటతెల్లంగా, ఎంత భావగర్భితంగా, ఎంత చక్కగా ఒక్క మాటలో చెప్పాడో చూడండి!

గమళ్ల వాళ్లంటే – ఆ మాట అవమానకరమైతే – గౌడులంటే, పూర్వం ఏమోగాని ప్రస్తుతం మాత్రం పల్లెల్లో నాలుగు రూపాయలు చేత పట్టుకున్న కులం వారి క్రింద లెక్క; వీరి సంపాదన మరొక వరానికి లేదంటారు; ధరెంతైనా పెట్టి, పల్లెల్లో పొలం కొనగల్గిన వారు వీరే నంటారు. అంటే పల్లెల్లో వుండే ఇతర వృత్తుల వారి కంటే, ఎక్కువ ఆదాయవర్గం వారు ఈ గౌడులేనన్నమాట. వీరికి కొరత లేకుండా జీవితాలు జరిగిపోయే ఆదాయాలైతే వున్నాయి కాని, వీరిలో లక్షాధికార్లు, కోటీశ్వరులు లేరు! రాష్ట్ర వ్యాప్తంగా ప్రతి పల్లెలో వుండే ఈ వర్గం వారిని తమ ప్రయోజనాలకు వుపయోగించు కోవాలని ఈ కాలం నాయకులు గౌడ్ సంఘాలు పెట్టి, మహా సభలు జరుపుతుంటారు. ఆ పరంపరలోనిదే బుధవారం జరిగిన నెల్లూరు సభ!

ఈ సభలు ఏర్పాటు చేస్తున్నవారు గాని, వుపన్యసిస్తున్న నాయకులు గాని ఎవరు? రాజకీయాలలో పదవులనుభవించిన, అనుభవిస్తున్న, అనుభవించాలని వుబలాట పడుతున్న ధనాఢ్యులైన నాయకులే. నెల్లూరు సభలోనే కాదు, ప్రతి జిల్లాలో జరుగుతున్న సభలలో పాల్గొంటున్న నాయకులు వీరే – బాలగౌడు, కె.ఇ. కృష్ణమూర్తి, మాచర్ల జగన్నాథం, దేవేంద్రగౌడ్, .... ప్రభృతులే! అవే ముఖాలు, అవే గొంతులు, అవే ప్రసంగాలు, అవే కోర్కెలు. గౌడనాయకులలో లచ్చన్న గారు మాత్రం ఈనాడు కాదు; పదవులు, రాజకీయ ప్రాబల్యం కోసం కాదు; గీత కార్మికుల సమస్యల కోసం నాకు తెలిసి నలభై ఏళ్లకు పైనుంచి స్వార్థరహితంగా పోరాడుతున్న నాయకుడు; ఖచ్చితమైన అభిప్రాయాలు, విశ్వాసాలు, సిద్ధాంతాలు, వ్యక్తిత్వము వున్న నాయకుడు; ఆయనకు పార్టీలు పదవులు ప్రధానం కాదు, తన మార్గాన తాను నడవడమే ప్రధానం. కల్లు సారాయి ఇజారాదారు కాదు; ధనికుడూ కాదు. సామాన్యుడు! ఈ ప్రజానాయకుణ్ణి మినహా యిస్తే తక్కిన వారు తమ రాజకీయాలకు కులాన్ని పూతం చేసుకోవాలను కునే సారాయి సామ్రాట్టులు, కోటీశ్వరులు. నెల్లూరు సభ నిర్వాహకులు ఎవరైందీ మీకు తెలియనిది తెలునుగదా! గమళ్ల వారిలోని వెంచయ్యలు, సుబ్బయ్యలు, రామయ్యలు, లక్ష్మయ్యలు పదవుల్లోకి రాలేరు, వారిని రానివ్వరు; గౌడ తత్వాన్ని రెచ్చగొట్టి, వారి అమాయకత్వాన్ని తమ రాజకీయ స్వార్థానికి వాడుకుంటారు ఈ స్వాములు! అంతే కాదు, తమ సారాయి వ్యాపారాలకు కాపుదు సారాయి వుత్పత్తి, రవాణాలకు సంఘబలాన్ని వుపయోగించు కుంటారు. పేరు వారిది, ఫలితం వీరిది. ఈ అంతర్యాన్ని, రహస్యాన్ని గౌడులే కాదు, వెనుకబడిన ఇతర కులాల వారు కూడా గ్రహించలేకున్నారు. శ్రీ రావుల అంకయ్య గౌడ్ అధ్వర్యం వహించే గౌడ్ మహాసభ మరెందుకంటారు – చెప్పండి?



## పూలమాల వేసే గతి లేదు!

జిల్లా ద్విశతాబ్ది వుత్సవ కమిటీ సమావేశంలో విగ్రహాల ప్రసక్తి వస్తున్నది. శ్రీ స్వర్ణవేమయ్య ప్రతి తడవా ప్రస్తావిస్తున్నారు. వారి సూచన సముచితమైంది ఆటువంటి త్యాగధనుల విగ్రహాలు చూచి, నేటి తరాల వారు స్ఫూర్తి పొందడం అవసరమే. విగ్రహాలు నెలకొల్పడం పెద్ద పనికాదు; వుండేదంతా తర్వాతే. దాని నిర్వహణ, భద్రత వగైరాలు ప్రధానం. ప్రతిష్ఠించిన తర్వాత కొన్ని విగ్రహాల ముఖం చూచే వారుండరు; దుమ్ము, ధూళితో నిండిపోయి, రూపమే కోల్పోయి, హృదయ విదారకమైన అనాదరణకు గురి యవుతుంటాయి. రాజకీయ విభేదాల వల్ల కొన్ని విగ్రహాలు వికృతం చేయబడుతాయి; కొన్ని అసలు ధ్వంసమే గావించబడుతాయి. కొన్నిటికి సంబంధించి కాలం గడిచే కొలదీ, తరం మారే కొలదీ, వారెవరైంది, వారి విశిష్ట సేవలేమైనది చెప్పినా తెలియని దౌర్భాగ్య పరిస్థితి ఏర్పడుతుంది. విగ్రహాలకు సంబంధించిన విషాదకరమైన అంశాలివి.

మొన్న మాటల సందర్భంలో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారన్నారు– నెల్లూరులో ప్రకాశం పంతులు, నెహ్రూ విగ్రహాలు నెలకొల్పారు. వారి జన్మదినం నాడు గాని, వర్ధంతి రోజు గాని, ఆ విగ్రహాలకు ఒక పూల మాల వేసి వారి సేవలను సంస్మరించిన దిక్కులేదు అని! అది యధార్థమైన మాట. నెల్లూరులో గాంధీజీ విగ్రహం కాక, సుభాష్ చంద్రబోస్ – పొట్టి శ్రీరాములు, జవహర్లాల్ నెహ్రూ, ఏ.సి., అంబేత్కర్ – విగ్రహాలు వున్నాయి. రాజీవ్ గాంధీ విగ్రహ ప్రతిష్ఠాపనకు అన్నీ సిద్ధంగా వున్నాయి; బహుశా విగ్రహం కూడా తయారుగా వుంటుంది; కాని ఎవరి అమృత హస్తాలతో ఎప్పుడు ఆవిష్కరింప బడాలనే విషయంతేలక

కొరవ 8 పేజిలో

# జమీన్‌రైతు
## ఎరువుల ధరలు

ఎరువుల ధరలను హఠాత్తుగా పెంచింది కేంద్ర ప్రభుత్వం. గిచ్చి, కళ్లనీళ్లు తుడిచినట్లు ఫాస్ఫేట్, పొటాష్ ఎరువుల ధరలు ఒకటికి రెండింతలు పెంచి, రైతుల ఏడ్పు మాన్పించి మభ్య పెట్టడానికి యూరియా ధరను మాత్రం 10 శాతం తగ్గించింది.

మన్‌మోహన్‌సింగ్ ఆర్థిక మంత్రి కాగానే ఎరువుల పై ప్రభుత్వ మిచ్చే సబ్సిడీని తీసి వేయడానికి ప్రయత్నించారు. కాని పెద్ద ఎత్తున ఆందోళన చెలరేగేటప్పటికి, ఆ ప్రయత్నాన్ని వాయిదా వేశారు. నేరుగా తనకు తాను సబ్సిడీ తీసేస్తే విమర్శలొస్తాయనే ఉద్దేశ్యంతో కాబోలు జాయింట్ పార్లమెంటరీ కమిటీ ఒకదానినిఏంనిరమించి, వారి సిఫార్సుల మేరకు నిర్ణయం తీసుకున్నామని నాటక మాడుతున్నది కేంద్ర ప్రభుత్వం.

ఈ కొత్త నిర్ణయం వల్ల యూరియా బస్తా ధర ఐదు రుపాయలా ఇరవై పైసలు తగ్గుతుంది. కాని సూపర్ ఫాస్ఫేట్, పొటాష్ ధరలు నూరు శాతం, డై అమోనియం ఫాస్ఫేట్ ధర 60 శాతం పెరుగుతుంది. రైతులు పెద్దగా వాడని అమ్మోనియం సల్ఫేట్, అమ్మోనియం క్లోరైడ్, కాల్షియం, అమ్మోనియం నైట్రేట్ తదితర ఎరువుల ధరలూ పెరుగుతాయి. ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీని రద్దు చేయడమే ఈ ధరల రెట్టింపుకు కారణం. దీనివల్ల ప్రభుత్వానికి ఏడాదికి 4500 కోట్లు మిగులుతుందట.

రైతులకు గిట్టుబాటు ధరలు ఇవ్వడానికి సవాలక్ష సాకులు చూపి, దాటవేసే ప్రభుత్వం, రైతును చావుదెబ్బతీసే, ఉత్పత్తి వ్యయం పెంపుకు దారితీసే నిర్ణయాన్ని మాత్రం పట్టుదలగా, దొంగచాటుగా ఈ దేశంలో, రైతాంగం పట్ల ప్రభుత్వానికున్న చులకన భావాన్ని వ్యక్తపరుస్తున్నది. రైతులు ఎల్ల కాలం ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలపై ఆధారపడి బ్రతకాలన్నది మా ఉద్దేశ్యం కాదు. కాని వ్యవసాయం గిట్టుబాటుకాని వ్యాపకంగా వున్నన్నినాళ్లూ రైతుకు సహాయ పడడం ప్రభుత్వ కర్తవ్యం. వ్యవసాయంలో కూలీల ఖర్చు తర్వాత ప్రధాన ఉత్పత్తి వ్యయం ఎరువుల వాడకమే. అసలే ఖర్చుకు, రాబడికి బొటాబొటిగా సరిపోయే దుస్థితిలో వున్న ఆహారధాన్యాల సాగు, ఎరువుల ధర పెంపకం వల్ల నష్టాలకు దారితీస్తుంది. దానిపై ఆధారపడిన రైతు దివాలా తీస్తాడు. మరీ దారుణమేమిటంటే, రైతు నోట్లో మట్టికొట్టిన ప్రభుత్వం, అదే నిర్ణయం ద్వారా ఎరువుల పరిశ్రమలకు విపరీతమైన రాయితీలు ప్రకటించింది. వారికి సరఫరా చేసే గ్యాస్ ధరలను 30 శాతానికి తగ్గించారు. ఉత్పాదక సామర్థ్యాని కనుగుణంగా వారికి సబ్సిడీలు ప్రకటించారు. ఈ విపరీత ధోరణి చూచే, జాయింట్ పార్లమెంటరీ కమిటీ సభ్యుడైన శ్రీ దేవగౌడ్, కమిటీ నివేదికకు తన అసమ్మతి ప్రకటించాడు. ఎరువుల ఫ్యాక్టరీలు తమ ఉత్పత్తి రవాణా ఛార్జీలలో తప్పుడు లెక్కలు చూపి, ప్రచారం ఖర్చు, జీతభత్యాలు పెంచి, ముడి పదార్థాల లెక్కలు తారుమారు చేసి ప్రభుత్వం నుంచి అధిక సబ్సిడీలు పొందే అవకాశం కన్పిస్తుందని దేవగౌడ్ అభిప్రాయపడ్డాడు. ప్రభుత్వ చట్టాలను తమ కనుకూలంగా మార్చుకోగల్గిన పారిశ్రామిక వేత్తలకు, లోప భూయిష్టమైన విధానాలు బంగారు గనుల క్రిందనే ఉపయోగ పడుతాయి. కాకులను కొట్టి గ్రద్దలకు వేయడానికి తప్ప ప్రభుత్వ కొత్త ఎరువుల విధానం ఇంకెందుకూ పనికి రాదు.

అసలే గత రెండేళ్లుగా రుతు పవనాల వైఫల్యం వల్ల దేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి గణనీయంగా తగ్గిపోయింది. ఇందిరా గాంధీ కృషితో సంభవించిన సస్య విప్లవం తర్వాత ఈ ఏడాదే ప్రప్రథమంగా గోధుమలు దిగుమతి చేసుకుంటున్నాం మనం. పరిస్థితి ఇట్లే కొనసాగితే పై ఏడాదికి దేశంలో ఆహార ధాన్యాల కరువు ఏర్పడడం తథ్యమని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. ఈ పరిస్థితులలో రైతులను ప్రోత్సహించి, ఆహార ధాన్యాల ఉత్పత్తి పెంచడం పోయి, రైతులను నిరుత్సాహ పరచడం వ్యవసాయరంగం పట్ల కేంద్ర ప్రభుత్వపు అవగాహనా లోపాన్ని, హ్రస్వదృష్టిని సూచిస్తున్నది. ఎరువుల ఉత్పత్తి ఖర్చు పరిమితం చేసి, తద్వారా సబ్సిడీల భారాన్ని తగ్గించుకొని వుంటే బాగుండేది. ఎరువుల కర్మాగారాలను ఆధునీకరించడం, కొత్త ఫ్యాక్టరీలను నెలకొల్పడం ద్వారా ఉత్పత్తి వ్యయం అదుపు చేయవచ్చు. ఫ్యాక్టరీల వైఫల్యాలకు, అసమర్థతకు రైతునే పెనాల్టీ చెల్లించమనడం అన్యాయం. ప్రభుత్వం నూతన ఎరువుల ధరలపై పునరాలోచన జరిపి, రైతు సమస్యలను సానుభూతితో అర్థం చేసుకోవాలి. మన పార్లమెంట్ సభ్యులు ఆ మేరకు ప్రభుత్వంపై వత్తిడి తేవాలి.

---

జమీన్‌రైతు
24.8.1942
8 పేజీలు అణా

### ఆంధ్రప్రజ నిలిపి వేస్తున్నాను

ఈ నెల 21 తేదిన జరిగిన నెల్లూరు పత్రికాధిపతుల సమావేశం వారి

డా. యం.యస్.మూర్తి,
ఎడిటర్.

### మనము -మనపత్రికలు

-చుండి జగన్నాథం.

గుర్రాలకు నోటికి కళ్లాలు తగిలించి రస్తాలో సవారిజేస్తారు యజమానులు. ఖైదీలకు చేతులకు సంకెళ్ళువేసి బంధిస్తారు.

గాంధీ పుణ్యమా అంటూ మనకు అవీ, ఇవీకూడా లభ్యమైనవి. ఈ ముసలివాడు చేసేది ఒక్కొక్కపనా?

21-8-42 తేది సా.6 గంటలకు నెల్లూరు పత్రికాధిపతులు జమీన్‌రైతు కార్యాలయమున ఆంధ్రప్రజ ఎడిటర్ డాక్టరు యం.యస్.మూర్తిగారి అధ్యక్షత క్రింద సమావేశమై ఈ క్రింది తీర్మానమును జేసిరి.

పత్రికలపై ప్రభుత్వంవారు విధించిన ఉత్తరువులు చాలా కఠిన ముగనున్నవనియు, వార్తా ప్రచురణయే దుస్సాధ్యమగు చున్నదనియు, పత్రికా గౌరమునకు భంగకరమనియు, ఇందుచే ప్రజానము దాయమునకు సరియగు సేవ

## 50ఏళ్లనాటి నిర్బంధాలు-పత్రిక నిలిపివేత

క్విట్ ఇండియా ఉద్యమ ఉధృతికి నిభాయించలేక బ్రిటీష ప్రభుత్వం నాయకుల డిటెన్షెకే కాక, పత్రికా స్వేచ్ఛకూ ఇనుప సంకెళ్లు వేసింది. ఆ నిర ఫ్ ందాలకు నిర సనగా దే శంలో ని పత్రికలన్నీ 1942 ఆగస్టులో నిల్చిపోయాయి. నేషనల్ హెరాల్డ్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, అమృతబజార్ పత్రికల వంటి ప్రసిద్ధ పత్రికలకూ తలుపులు మూయక తప్పలేదు. ప్రభుత్వ నిషేధానికి గురై 1942 ఆగస్ట్ 24 తేదినుంచి జమీన్‌రైతు నిల్చిపోయింది;

తిరిగి ఆ ఏడాది నవంబరు 20 తేదివరకు, 3 నెలల పాటు పత్రిక వెలువడలేదు. అందువల్ల వచ్చే వారం నుంచి 50 ఏళ్ళక్రితం ఈ వారం శీర్షికను నిలుపుతున్నాము.

-సంపాదకుడు

***

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

తీర్మానమునునసరించి మా "ఆంధ్రప్రజ" పత్రికను తాత్కాలికంగా నిలిపి వేయడమైనది. వాక్ స్వాతంత్ర్య మున్నూ, పత్రికా స్వాతంత్ర్యమున్నూ, స్వేచ్ఛయు ననంగని నేటి భారత ప్రభుత్వ పరిపాలనలో ఆర్డినెన్సుల మధ్య పత్రికలను నడుపుకొనుటకు యెంత మాత్రము వీలుగాకున్నది.

గౌరవమును నిలబెట్టుకొని, ప్రజాను గుణ్యముగా పత్రికారచన జరుపుటకు వీలులేని పరిస్థితులుద్భ వించినవి కాబట్టి, అట్టి సుస్థిర పరిస్థితు లేర్పడే టంతవరకు మా పత్రికను తాత్కాలికముగా నిలిపి వేయడమైనది.

గాన, ఆ పత్రిక యొక్క చందాదారులు గాని, అభిమానులు గాని, చదువరులుగాని, యీ తాత్కాలిక వియోగమునకు క్షమింప వేడుచున్నాము.

గాంధీమీద కోపంతో ప్రభుత్వం పత్రికల మీదకు దూకుతున్నది. యిట్లయితే యిక మేం నిభాయిం చలేమురో బాబూ అని దేశవాళీ పత్రికలు ఒకటివెంబడి ఒకటి కార్యాలయాలు బందిచేసినవి.

ఎంతెంత అవస్థవచ్చి పడ్డదండీ దేశానికి?

వస్తేఏం? నిన్నుజూచి జాలి పడేదెవరు. ఈ దిక్కుమాలిన దేశంలో?

### నెల్లూరులో 7పత్రికలు నిలిచిపోయినవి.

చేయలేని పరిస్థితులు యేర్పడి వందువనూ, ఈ సమావేశం వారు తమ అసమ్మతిని తెలుపుచూ, అనుకూల పరిస్థితులు యేర్పడు నంతవరకూ అసమ్మతి సూచకముగా నెల్లూరు నుండి వెలువడు ఈ దిగువ పేర్కొనబడిన పత్రికల ప్రచురణను ఈ నెల 24-8-42 తేదినుండి నిలుపవలసిందిగా ఈ సమావేశం వారు తీర్మానించడ మైనది.-ఈ తీర్మాన ప్రకారము ఈ క్రింది 7 పత్రికలు నిలిచిపోవుచున్నవి.

1.ఆంధ్రప్రజ, 2.జమీన్‌రైతు 3.కేసరి 4.సింహపురి 5.ప్రజాసేవ 6. దక్కన్‌వైశ్య 7.సుబోధిని.

---

## ప్రక్కరాష్ట్రాల్లోని కాలేజిలు ఈ విద్యార్థి సంఘాలకు కన్పడడం లేదా?

ఆంధ్రప్రదేశ్ లో కొత్తగా అనుమతించిన మెడికల్, డెంటల్ కాలేజిల్లో కేపిటేషన్ ఫీజుకు వ్యతిరేకంగా ఉద్యమాలు చేపడుతున్న జాతీయ విద్యార్థి ఫెడరేషన్లు, పరిషత్‌లు, రాజకీయ పార్టీలకు పక్కరాష్ట్రాలైన మహారాష్ట్ర, కర్నాటకల్లోని ప్రైవేట్ కాలేజిలు కనపడలేదా? అక్కడ ఈ ఉద్యమాల ఊసేలేదే? ప్రాంతీయ రాజకీయ ద్వేషంతో కూడిన ఈర్ష్యతో వ్యవహరిస్తున్న ఈ విద్యార్థి సంఘాల ధోరణి గర్హనీయం. ఒనేషన్ల విధానం దేశమంతటా రద్దుచేస్తే మంచిదే. కొన్నిచోట్ల ఉండి మరికొన్ని చోట్ల లేకపోవడం వల్ల, చాలా అనర్థాలు సంభవిస్తున్నాయి మహారాష్ట్రలోని ఇంజనీరింగ్, మెడికల్ కాలేజిల్లో 50 శాతానికి పైగా చదువుతున్నది ఆంధ్ర విద్యార్థులే. దీనికోసం వారు లక్షలు వెచ్చిస్తున్నారు. ఉద్యోగాలు తెచ్చుకుంటున్నారు. ప్రైవేట్ కాలేజిలు కల్గివున్న గ్రామాలు ఎంతగానో అభివృద్ధి చెందుతున్నాయి. ఈ విధానం అంతా తెలిసిన మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల్లోని జాతీయ స్థాయి కల్గిన విద్యార్థి సంఘాలు గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాయి. శ్రీ జనార్ధనరెడ్డి మీద కక్షతో ప్రస్తుతం ఆంధ్రలో మాత్రం రభస సృష్టిస్తున్నాయి.ఇది కుచించు కపోతున్న

### జనవాణి

విద్యార్థి సంఘాల ధోరణికి నిదర్శనం. తమ జాతీయత నిలబెట్టుకోక పోతే అవి ప్రాంతీయ స్థాయికి చేరుకోవడం తథ్యం.

-వి.విజయకుమార్ ఎం.ఎస్.,

రామ్‌టెక్ (మహారాష్ట్ర)

### జిల్లా పేరు మార్చడం తగదు

నెల్లూరు జిల్లా పేరును మార్చి శ్రీ పొట్టి శ్రీరాములు పేరు పెట్టాలని కోరడం మంచిదికాదు. అమరజీవి దీక్ష వల్ల ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది గాని జిల్లాకాదు. ఆ మహనీయుని పేరు చిరస్థాయిగా నిలచి పోవాలన్నా, రాష్ట్ర వ్యాపితంగా ప్రాచుర్యం పొందాలన్నా ఒక స్మారక చిహ్నం ఏర్పాటు చేయడం సమంజసం. అంతేకాని ఆయన పవిత్ర నామాన్ని జిల్లాకు మాత్రం పరిమితం చేయడం ఆయన్ను అగౌరవ పర్చడమేనని అందరూ గ్రహించాలి.

ప్రకాశం, రంగారెడ్డి జిల్లాలు నాయకుల పేరుతో ఉన్నాయని కొందరు వాదించవచ్చు. కాని ఆ రెండు జిల్లాలు కొత్తగా ఏర్పడినపుడే ఆ పేర్లు పెట్టడం జరిగిందన్న విషయం గమనించాలి. నెల్లూరు జిల్లా ఎన్నో వందల సంవత్సరాల క్రితం ఏర్పడి, ఆ పేరుతోనే కొనసాగుతున్నది. నెల్లూరు బియ్యం అంటే అంతర్జాతీయ ప్రఖ్యాతి. పేరు మార్చాలని కోరుతున్న ప్రముఖులకు చేతనైతే శ్రీ శ్రీరాములు పేరుతో ఒక విశ్వ విద్యాలయం ఏర్పాటయ్యేలా ప్రభుత్వంపై వత్తిడి తేవడం బాగుంటుంది తప్ప జిల్లా పేరు

తరువాయి 8 పేజీలో

## తక్కువ ఎరువులతో ఎక్కువ దిగుబడికి

# భూసార పరీక్ష తప్పని సరి!

సాధారణంగా పంట దిగుబడి. మొక్కలు నేలలో ఉన్న పోషక ధాతువులను ఉపయోగించుకొనే తీరుపై ఆధారపడి వుంటుంది. పోషక పదార్థాన్ని అందించకుండా పంట దిగుబడి పెంచాలంటే భూమి భౌతిక రసాయన స్వరూపాన్ని బట్టి నేల సారాన్ని వినియోగించుకోవాలి. ఆధునిక వ్యవసాయంలో రైతులు అధిక దిగుబడులు సాధించాలంటే తమ పొలాల భూసార పరిస్థితిని తెలుసుకోవడం చాలా అవసరం.

సాంకేతికంగా భూసార స్థితిని తెలుసుకోవాలంటే నాలుగు పద్ధతులున్నాయి.

1.మొక్కలలో వచ్చే పోషకాహార ధాతువుల లోపాలు, వాటి లక్షణాలు గమనించడం.2.పెరిగే మొక్కల ఆకులను విశ్లేషించడం. 3.నేలలో పెరిగే మొక్కలు మరియు సూక్ష్మజీవుల ఉనికిని పరీక్షించడం 4. భూసార పరీక్షలు చేయడం.

పై పద్ధతులలో భూసార పరీక్ష తప్ప మిగిలిన వాటిని విశ్లేషించుటకు అనుభవం, సమయం చాలా అవసరం. ఎక్కువ నమూనాలను పరీక్షించుటకు సాధ్యపడదు. కాని మట్టి నమూనాల పరీక్షలను తక్కువ కాల పరిమితిలో చేయవచ్చు. అంతేకాకుండా పైర్లు వేసే ముందుగా సకాలంలో భూసార పరీక్షా ఫలితాలను రైతుకు అందించవచ్చు. మట్టి పరీక్ష ద్వారా నేలలోని పోషక ధాతువు మోతాదును, మొక్కకు దాని అందుబాటు శక్తిని నిర్ధారించవచ్చు. అంతేకాకుండా భూమి భౌతిక లక్షణాలను తెలుసుకోవచ్చు. భూసార పరీక్ష ముఖ్యోద్దేశ్యాలు ఏమిటంటే-

1.పొలం యొక్క భూసార పరిస్థితిని నిర్ధారించడం. అంటే మొక్కకు అత్యవసరమైన లభ్య నత్రజని, గంధకము, మెగ్నీషియం, జింకు, ఇనుము, మాంగనీసు, కాపర్ తదితర పోషక పదార్థాలు నేలలో ఎంత మోతాదులో వున్నాయో నిర్ధారించడం. 2.వేసిన రసాయనిక ఎరువులకు లాభదాయకమైన దిగుబడి వుందో లేదో అంచనా వేయడం. 3. పంటలకు ఎరువులను సిఫార్సు చేయడం కోసం తగిన సమాచారాన్ని

**రైతులోకం**

* * *

**కీర్తి వెంకయ్య**

తెలుసుకోవడం. తద్వారా ఆయా ప్రాంతాలలోని లేక రాష్ట్రం మొత్తం మీద భూసార స్థితిని అంచనా వేసి పరిశోధనా పరంగాను, విద్యాపరంగాను అభివృద్ధి ప్రణాళికను తయారుచేయడం. 4.భూసార స్వభావాన్ని కనిపెట్టి వివిధ రకాల పోషక ధాతువులు ఏ మోతాదులో వున్నవో తెలుసుకొని ఆ నేలలను వర్గీకరించి పైరును బట్టి రసాయనిక ఎరువుల సిఫార్సులు పొందడం. 5.నేల ప్రత్యేక లక్షణాలైన క్షారగుణం, ఆమ్లగుణం, లవణముల సాంద్రత తెలుసుకొని తదనుగుణంగా సిఫార్సులు చేయడం.

భూసార పరీక్షల వల్ల పొలాలకు ఎంతెంత పోషక ధాతువు అవసరమో తెలుస్తుంది. కాని మొక్కలు ఎదగాలంటే వాటికి కావలసిన ఇతర అనుకూల పరిస్థితులలో భూసారం కూడా ఒకటి మాత్రమే నని తెలుసుకోవాలి.

చాలామంది రైతులకు భూసార పరీక్షల మీద పెద్ద అవగాహన లేదు. చాలా తక్కువ మంది మాత్రమే ఈ పరీక్షలు చేయిస్తున్నారు. చేసిన తర్వాత కూడా శాస్త్రవేత్తలు ఇచ్చిన సిఫార్సులను ఆచరించడం జరగడంలేదు. దీనివల్ల ఈ నాటి సాంద్ర వ్యవసాయ పద్ధతులలో రసాయనిక ఎరువులు తగిన మోతాదులలో అందక పోవచ్చు. రసాయనిక ఎరువులను అవసరానికి మించి వాడే అవకాశమూ వుంది. ఇందువల్ల దిగుబడులు తగ్గిపోతాయి. అధిక మోతాదులలో ఎరువులు వాడడం వల్ల ఖర్చు పెరిగి, నికరాదాయం తగ్గే అవకాశముంది. కనుక రైతులు పైర్లు సాగుపద్ధతులను సాగు చేయవలసిన పంటలను తెలియచేస్తూ ఆ నేలల భూసారాన్ని, ఇతర వివరాలను తెలుసుకొని రసాయనిక మరియు సేంద్రియ ఎరువులు వాడడం. లాభదాయకం.

### మట్టి నమూనాలు ఎలాతీయాలి?

మట్టి నమూనాలు తీసే పద్ధతి ఆ మట్టి యొక్క రసాయనిక విశ్లేషణ కంటే

-రవ 10 పేజీలో

# ఏడుగురు కోచ్‌లున్నా ఆటల నైపుణ్యాం సున్న!

నెల్లూరు ఎసి స్టేడియం పనితీరుపై గతవారం వ్రాసిన వార్త అక్కడి కోచ్‌లకు బాగా బాధ కల్గించి నట్లుంది. ఆ వార్తలోని సంగతులన్నీ అసత్యాలని, తమపై గిట్టని వారు చేసే దుష్ప్రచారాలని వారు ఖండిస్తున్నారు. తమకు వచ్చే బంతులు, పరికరాలు అమ్ముతున్నామన్నది కేవలం నింద మాత్రమేనంటాడు - కోచ్ శ్రీ చౌదరి చాలా కొద్ది మొత్తానికి మాత్రమే పరికరాలు తెప్పిస్తున్నారట. ఇతరులు ఆడే ఆటలకు తాము పరికరాలు బంతులు సరఫరా చేయనవసరం లేదన్నది వీరి వాదన. తాము ఆటలలో శిక్షణ ఇవ్వడం లేదన్న ఆరోపణనూ తిరస్కరిస్తున్నారు వారు. స్టేడియంకు వచ్చే వారికి శిక్షణ నివ్వడంతో పాటు, మూలపేటలోని స్కూళ్లలో ప్రతిరోజూ ఆటలు నేర్పిస్తున్నారట. స్టేడియంకు ముఖ్యమంత్రి ఇచ్చిన నిధులతో చేపట్టబోయే నిర్మాణాలకు ఆర్కిటెక్ట్‌గా నియమించిన వ్యక్తికి, స్టేడియం నిర్మాణంలో అనుభవం లేకున్నా నిపుణుడని కోచ్‌లు సర్టిఫికెట్ ఇస్తున్నారు. స్టేడియం భవనంలో ఆటల సంఘాలకు గదులివ్వడానికి తమ దగ్గర చాలనన్ని గదులు లేవన్నది వీరి వాదన.

వార్త వ్రాసినందుకు కోచ్‌లు బాధపడుతున్నారు కాని, ఒకరికి ఏడుగురుగా తాము ఈ స్టేడియం ద్వారా జీతాలు, సౌకర్యాలు అనుభవిస్తున్నా, నెల్లూరులో క్రీడా సక్తిని పెంచడానికి, ఆటలపై ఉత్సాహం వున్నవారికి శిక్షణ నివ్వడానికి ఏ మాత్రం పనిచేస్తున్నామో ఆలోచించుకోవడం లేదు. ఒక్క అథ్లెటిక్స్‌లో తప్ప మరే ఇతర ఆటల

**సింహపురి**

కోచ్‌లూ కనీస పాటి శ్రద్ధ చూపడం లేదన్న ఆరోపణ నూటికి నూరుపాళ్లు నిజం. పిఇటిలు తమ దగ్గరకు పిల్లలను పంపడం లేదనే సాకు చూపుతున్నారు వారు. కాని, పిఇటిలను పిల్చి, ఇక్కడ సౌకర్యాలు వివరించి, పిల్లలను ఆకర్షింపచేయడానికి వారు చేసిన, చేస్తున్న ప్రయత్నం పూజ్యం. స్పోర్ట్స్ కౌన్సిల్ నిబంధనల ప్రకారం ముఖ్యంగా గ్రామీణ క్రీడలు నిర్వహించడం తప్ప. వీరు ఆటల ప్రోత్సాహానికి క్షణమాత్రం శ్రద్ధ చూపటం లేదు. 18 ఏళ్ల లోపల వయస్సు వుండే పిల్లలకే ఆటలు నేర్పాలన్నది వారి నిబంధన అట. ఆ వయస్సు పిల్లలకు ఇక్కడ ఆటలు నేర్పుతారన్న సంగతే తెలియదు; తెలిసి వచ్చే పెద్ద వయస్సు వారి జోలికి వీరు పోవడం లేదు. స్వంత వ్యాపారాలు, స్వంత వ్యాపకాలతో క్షణం తీరిక లేని కోచ్‌లు స్టేడియంకు ఎట్లా రాగలరు చెప్పండి?

### హాకి జట్టు ఎంపిక

ఆరవ ఆంధ్ర రాష్ట్ర అంతర్‌జిల్లా సబ్‌జూనియర్ హాకీ పోటీల్లో పాల్గొనే జిల్లా జట్టు ఎంపిక 30 తేదీ జరుగుతుంది. సెలక్షన్‌లో పాల్గొన దలచిన వారు, పుట్టిన తేది సర్టిఫికెటు, రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలతో తనను కలవమంటున్నారు- జిల్లా హాకీ అసోసియేషన్ ఉపాధ్యక్షుడు శ్రీ కె. దేవప్రసాద్. పోటీలు సెప్టెంబరు 17 నుండి 20తేది వరకు అనంత పురంలో జరుగుతాయి.

### 'జాగృతి'

జిల్లాలో జరుగుతున్న సారా వ్యతిరేక ఉద్యమానికి మద్దతుగా టౌన్‌లోని

తరువ 7 పేజీలో

## సణుగుడు

* సారాయి త్రాగండోయ్ అన్న లారా, సర్కారును బ్రతికించండి!

* ప్రధానమంత్రి ఫ్రెండ్ అయితే ఏడింతలు అదనపు లంచం - గూడూరు రిజిష్టారాఫీసులో నూతన నియమం!

"కల్లు తాగండోయ్,
కూలినాలి జనుల్లారా
ఖుషీలో తేలండోయ్!
సారాయి సేవించండోయ్
శ్రామిక సోదరుల్లారా
స్వర్గపుటంచులు చూడండోయ్!
విస్కీనొ సోసన పట్టండోయ్,
మధ్యతరగతి మానిసుల్లారా
జీవన మాధుర్యం కనరండోయ్!
సారా, విస్కీ, కల్లు
బ్రాంది, బీరు, జిన్ను-
ఇలలో స్వర్గం చూపే,
కలల్లో ముంచి తేల్చే,
నిఖార్సయిన మార్గాలని
తెలుసుకోండోయ్!
కల్తీలేని సరకు..
కైపెక్కించే సరకు..
కావాలంటే పొట్లంపై
సర్కారు ముద్ర చూడండి
అసలు సిసలు
బ్రహ్మంగారు చెప్పిన
కాలజ్ఞానం కనలేదా
గ్లాసులు గ్లాసులు సారా
గుటకలేస్తూ త్రాగితే
తినడానికి తిండెట్లని
చింత పడవలదో అన్నా-
సారాయి ఇచ్చే సర్కారే
సబ్సిడీ బియ్యమూ
సిబొచ్చెలో వేస్తుందన్నా!
జీతం సొమ్మంతా
విస్కీకే హరించుకపోతే
పెళ్ళాం పిల్లల సంగతేమిటన్న
అదుర్దా వలదోయన్నా
టేబిల్ క్రింద చేతులు పెడితే
జేబుల నిండా డబ్బేనన్నా!"
సారా కడే గుర్తని నమ్మండి!
సారా త్రాగిన వాడు
పైసాకి కొరగాని వాడని
గిరీశం చెప్పిన
గీతోపదేశం వినలేదా?
కల్లు త్రాగనివాడు
కొల్లుదున్నపోతై
పుట్టాడని అనాడే

చెవులు పగిలిపోతున్నాయి, ఆపవయ్యా, ఇదెక్కడి సొద?

"నన్నెవ్వరాపలేరివేళ
నాధాటి కోపలేరివేళ!"

నీకేమైనా పిచ్చి పట్టిందా, ఏమిటా వెధవ కవిత్వమూనూ, నువ్వూను!

అపచారం, అపచారం, ఇది వెధవ కవిత్వమా? మహాఘనత వహించిన ఆంధ్రప్రదేశ్ ఏరతనం వారు సారా ప్రచారం కోసం నిర్వహించనున్న

**డోలేంద్ర**

కవిసమ్మేళనానికి స్పెషల్‌గా వ్రాస్తున్న గీతాలివి. దీన్ని వెధవ కవిత్వమన్నావంటే పోలీసులు లాఠీలతో బాదుతారు జాగ్రత్త!

సారా ప్రచారమా? సారా వ్యతిరేక ప్రచారమా? నీ ధోరణి చూస్తే త్రాగి మాట్లాడు తున్నట్లుంది!

నువ్వే సత్తెకాలపు మనిషివి. సారా వ్యతిరేక ప్రచారమంటే, పోలీసులు బొక్కలో త్రోసి, మక్కెలిరగ దంతారు. జనమంతా సారాయి త్రాగి, ఖుషీగా బ్రతికేట్లు చూడమని ఏరతనం పోలీసులకు హుకుం జారీ చేసిన సంగతి నువ్వు వినలేదా?

శివ!శివ! కాంగ్రెస్ ప్రభుత్వమేనా ఆ ఉత్తర్వు చేసింది?

ఆహా! అక్షరాలా కాంగ్రెస్ ప్రభుత్వమే!

ఆ అవసరం ఎందుకొచ్చింది?

ప్రజలు పడే బాధలు చూడలేక!

కష్టాలకు, సారాయికి సంబంధమేమిటి?

సగటు మనిషికి పొద్దున లేచిన దగ్గర్నుంచి ప్రతిదీ సమస్యే! కొళాయి

తరువ 8 పేజీలో

# కావలి పన్నుల పెంపు పదిహేను రెట్లు!

## ఇంటిపన్ను నోటీసులుచూచిపౌరులుగుండెలుబాదుకుంటున్నారు!

కావలి టౌన్‌లో కొత్తగా పెంచిన పన్నుల ప్రకారం వైకుంఠపుర వాసులకు డిమాండు నోటీసులు పంపింది మునిసిపాలిటీ! పెన్సిలిన్ వంటి మందులకు టెస్ట్‌డోస్ ఇచ్చినట్లు, విడుదల చేసారి శ్రీముఖాలను. మధ్యతరగతి పౌరులు, విద్యావంతులు నివసించే ప్రాంతాలను వదలిపెట్టి, నూటికి 75మంది కూలివాలి ప్రజలుంటే ప్రాంతం ఎన్నుకోవడంలోనే మునిసిపాలిటీ ఉద్దేశ్యం అర్థమై పోతున్నది. ఒకటికి పది,పన్నెండు రెట్లుగా పెంచిన పన్నులపట్ల ప్రజలెట్లా ప్రతిస్పందిస్తారో చూడడం దీని అంతర్యం. ఒక ప్రాంతంలో భయపెట్టో, బ్రతిమాలాడో, పన్నులు దండేస్తే తక్కిన టౌన్‌పౌరులు కుక్కిన పేనుల్లాగా చెప్పినంత పన్ను కట్టితీరుతారన్నది వారి ఆలోచన అట. పౌరులను మరీ అంత వెర్రి వాజమ్మలుగా జమకడుతున్నారన్నమాట మునిసిపల్ అధికారులు.

మునిసిపల్ ఆదాయం పెంచడానికి పన్ను పెంచడంలో ఆక్షేపించాల్సినదేమీ లేదు కాని, తమ ఇష్టంవచ్చినట్లు ఆఫీసులో కూర్చుని దేముడంకెలు వేసుకొని కట్టారా, చస్తారా అని ప్రజల గొంతు మీద కత్తిపెట్టడం మాత్రం క్షంతవ్యంకాదు

కొత్త పన్నుల విధానం ప్రకారం ఏ ఇంటికి ఎందుకు ఎంతెంత పన్ను పెంచారో మునిసిపల్ అధికారులు చెప్పేపరిస్థితిలో లేరు. ఒక పద్ధతి, పాడు లేకుండా పన్నులు విధించడమే దీనికి కారణం. జోన్ల విభజనే సరిగాలేదు. నివాస ప్రాంతాలేవి, వ్యాపార ప్రాంతాలేవి, పారిశ్రామిక ప్రదేశాలేవి అన్న గుర్తింపులో అధికారులు పరమ నిర్లక్ష్యంగా వ్యవహరించారు. ఇళ్లకొలతలు తీసుకోవడానికి సర్వేయర్లను, ఇంజనీర్లను వినియోగించ లేదు. బిల్లు కలెక్టర్లకు బాధ్యత అప్పచెప్పారు. వారు మొక్కుబడిగా కొలతలు తీశారు. కొన్నిచోట్ల ఉరామరిగ్గా అంచనావేసి వ్రాసుక పోయారు. తామేమి వ్రాసుకొన్నది ఇళ్లయజమానులకు చెప్పలేదు. బాడుగకిచ్చిన ఇల్లా లేక స్వంతదారా అన్న వివరాలు అడగనే లేదు. రేట్ పేయర్ల సంఘం, టౌన్ వెల్ఫేర్ కమిటీ వంటివి చేసిన సూచనలను చెత్తబుట్ట దాఖలు చేశారు.

కొత్త పన్నుల విధానంలో వంద శాతానికి మించి పన్ను పెంపకం వుండదని మునిసిపల్ మంత్రి చేసిన ప్రకటన కావలి అధికార్ల చెవిన పడినట్లే లేదు. ఇప్పుడు జారీ చేసిన నోటీసుల ప్రకారం డి.వెంకట సుబ్బయ్య అనే పౌరుడి ఇంటికి పాత పన్ను రూ14.10 పైసలైతే కొత్త పన్ను రూ214.90పైసలు. అంటే 1500శాతం హెచ్చింపు అన్నమాట. ఒక పాత వడిన పెంకుటింటికి పాత పన్ను తొమ్మిది రూపాయలైతే కొత్తపన్ను రు 157లు. ఆ ఇళ్ల యజమానులు గుండెలు బాదుకుంటున్నారు. ఈ లెక్కన టౌన్‌లోని మామూలు ఇళ్లకు ఎన్నెన్నివేల పన్ను పడివుంటుందో ఊహించుకుంటేనే గుండె వగుల్తుంది. ఇల్లు కల్గివుండడమే నేరం క్రింద పరిగణనయ్యేట్లుంది.

మునిసిపల్ అధికారులు నోటీసు లిచ్చినంత వరకు పౌరులువేచివుండడం అనవసరం. ఈలోనే సంఘటితమై ఈ పన్ను దోపిడిని ప్రతిఘటించడానికి పూనుకోక తప్పేట్లులేదు. ఉద్యమం ద్వారా గాని, కోర్టుల ద్వారా గాని పేదలకు జరుగుతున్న అన్యాయం సరిదిద్దబడాలి!

## జిల్లావార్తలు

### ఏలూరు ఎమ్మెల్యేకు కావలిలో సన్మానం

ఏలూరు శాసన సభ్యుడు శ్రీ నేరెళ్ల రాజాను కావలి లోని వైశ్య సంఘాలవారు శనివారం ఘనంగా సన్మానించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభను కావలి మున్సిఫ్ మేజిస్ట్రేట్ శ్రీ ఎన్. మాల్యాద్రి అధ్యక్షించారు. రాతియుగం నాడు రూపొందించిన నిత్యావసర వస్తువుల చట్టం నేటికీ కొనసాగుతుండడం ఘోరమని సభలో ప్రసంగించిన శ్రీ నేరెళ్ల రాజ అన్నారు. ఈ నెలాఖరుకు కాలదోషం పడుతున్న ఈ చట్టాన్ని తిరిగి ప్రవేశ పెట్టనీయకుండా వర్తకులంతా తమ నిరసనను ప్రజాస్వామ్య యుత పద్ధతుల్లో తెలియచేయాలని సూచించారు పట్టణ వైశ్య ప్రముఖులు ఎన్. మాలకొండయ్య, పి. నటరాజయ్య, ఎన్.రామకృష్ణ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఉదయగిరిలో సద్భావనా దినోత్సవం

శ్రీ రాజీవ్ గాంధీ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని ఉదయగిరిలో ఆగష్టు 20వతేది సద్భావన దినోత్సవం ఘనంగా జరిగింది. ఎ.ఆర్.ఆర్. ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఈ సందర్భంగా ఒక సభ ఏర్పాటయింది. డాక్టర్ రామసుబ్బయ్య, శ్రీ ఎ.ఎఫ్ ఖాజారహమతుల్లా స్వర్గీయ రాజీవ్ గాంధీ దేశాభివృద్ధికి చేసిన సేవలు పరామర్శించారు. అనంతరం కళాశాల విద్యార్థులు 'మనమంతా ఒక్కటి' అన్న గేయ నృత్య నాటికను ప్రదర్శించారు. అంతకు ముందు గ్రామంలో భారీఎత్తున సద్భావనా ర్యాలీ నిర్వహించారు.

### నెల్‌కాస్ట్ వార్షికోత్సవం

గూడూరు టౌన్‌లోని ఆటో మొబైల్ విడిభాగాలు తయారు చేసే పరిశ్రమ 'నెల్‌కాస్ట్' ఉద్యోగుల సంఘం ఐదవ వార్షికోత్సవం స్వాతంత్ర్య దినోత్సవం నాడు జరిగింది. సందర్భంగా డి.ఎన్.ఆర్. కమ్యూనిటీ హాలు లో జరిగిన సభలో డాక్టర్ సి.ఆర్.రెడ్డి ప్రసంగిస్తూ నెల్‌కాస్ట్ ఉద్యోగులు వారి సంక్షేమమేగాక ప్రజదరి సంక్షేమం కోసం ఉచిత వైద్యశిబిరాలు

కొరవ 7 పేజీలో

# సారాయి పాటలు పెడితే రణరంగమేనట!

26 తేది నెల్లూరులో జరిగిన జిల్లా గౌడ మహాసభలో కల్లుగీత కార్మికుల సమస్యలపై మాట్లాడడం తక్కువై రాష్ట్ర కాంగ్రెస్ రాజకీయాల్లో సమ్మతి-అసమ్మతిపై వర్గ నాయకుల మనోగతాలు బహిర్గత మయ్యాయి. "మనకు ఇతరులెవ్వరూ నాయకులుకాదు, మనకు మనమే నాయకులం" అని, స్వోత్కర్షగా వేదిక నలంకరించిన నాయకులు చెప్పుకున్నారు. గీత కార్మికుల సమస్యలు తీర్చకుంటే ప్రభుత్వాలనే సైతం దించేస్తామని ఉత్తర కుమారుల్లా ప్రజ్ఞలు పలికారు. సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర కల్లుగీత కార్మికుల ఫైనాన్స్ కార్పొరేషన్ ఛైర్మన్ మాజీ ఎమ్మెల్యే శ్రీ మాచర్ల జగన్నాథం కల్లుగీత వృత్తికి వచ్చిన అపదేమీలేదనిరాష్ట్రంలో కల్లును నిషేధించరని అన్నారు. ముఖ్యమంత్రిగా శ్రీ ఎన్.జనార్ధనరెడ్డి పదవి బాధ్యతలు

> **జిల్లా గౌడ మహాసభలో అంకయ్య గౌడ్ అరుపులు**

స్వీకరించాక కల్లుగీత కార్మికుల కోసం కార్పొరేషన్ ను ఏర్పాటు చేసేందుకు శ్రద్ధ వహించి, రెండు కోట్ల మూలధనాన్ని సమకూర్చినట్లు చెప్పారు. గీత కార్మికులకు జరుగుతున్న సహాయాన్ని వివరించారు. మాజీ ఎమ్పీ శ్రీ టి. బాలగౌడు కూడా ప్రభుత్వ విధానాలను సమర్థిస్తూ, కొత్త సొసైటీ ఏర్పాటు నియమనిబంధనలను సడలించాలని కోరారు. మంత్రి పదవి కోసం తహతహలాడుతున్న మాజీ మంత్రి శ్రీ కె.ఇ.కృష్ణమూర్తి మాత్రం ప్రభుత్వ విధానాలపై విమర్శలు గుప్పించారు. తెలుగు దేశీయుడు, రంగారెడ్డి జిల్లా ప్రజాపరిషత్ ఛైర్మన్ శ్రీ దేవేంద్రగౌడు కాంగ్రెస్‌మీద విరుచుక పడ్డారు. 45సంవత్సరాలుగా ఒకే పార్టీకి అధికారం కట్టబెట్టం కట్టబెట్టడంతో ఈ దుస్థితి దాపురించిందన్నారు. జనార్ధనరెడ్డి, చెన్నారెడ్డి ప్రజానాయకులు కారు; ప్రధాని ఒక పలుకు పలికితే ఊడిపోయే పదవుల్లో ఉన్న వాళ్లు, మనమంతా సంఘటితమై, నాయకుల్లా తయారై ప్రభుత్వాలను శాసించాలన్నారు.

సభా నిర్వాహకుడు, జిల్లా సారా వ్యతిరేక ఉద్యమంతో వ్యాపారం దెబ్బతిన్న శ్రీరావుల అంకయ్య గౌడు మాత్రం ముఖ్యమంత్రి, కలెక్టర్లపై చిందులు తొక్కారు; నిప్పులు కూడా కక్కారు. ప్రభుత్వం మా కుల్ల పోళ్లను యెదవలుగా పరిగణిస్తున్నది.తగిన సమాధానం చెబుతాము. జిల్లా కలెక్టర్, ఎక్సైజ్ అధికార్లు సారావ్యతిరేక ఉద్యమాన్ని జిల్లాలో పెంచి పోషించారు. ముఖ్యమంత్రి గారేమో తనకుఉద్యమం వూసే తెలియదని వుత్తమాటలు చెప్పారు. రేపు పాటలు జరిగేటప్పుడు కలెక్టర్ సీటిలో వచ్చి కూర్చుని సారా పాటలు ఎట్లా నిర్వహిస్తారో చూద్దాం. అందుకే ముఖ్యమంత్రి జిల్లాలో సారా అమ్మకాలను నిషేధించాలి. లేకుంటే వచ్చే ఎన్నికల్లో

కొరవ 7 పేజీలో

## శ్రద్ధాంజలి

"పశువునందు మృతులొందు మృతులు ధన్యులు" (ప) 14 : 13

నవ్యకళాభారతీ స్థాపకుడు, లైసెన్స్‌డ్ బిల్డింగ్ సర్వేయరు ఎమ్. రాజారావు 21.8.92 తేది పరమపదించినారు. వారి ఆత్మశాంతించు లాగు నెల్లూరు– సుబేదారుపేట లోని స్వగృహము వద్ద 2.9.92 తేది సాయంకాలము 6 గంటలకు ప్రార్థనా సమావేశము జరుగును. బంధుమిత్రులకు, శ్రేయోభిలాషులకు తెలియజేయడమైనది.

—కుటుంబసభ్యులు, బంధుమిత్రులు

## జనరల్ నోటీసు

ఈ క్రింది షెడ్యూలు దాఖలా భూములు, స్థలములు నా క్లయింటు సి. అభిరామిరెడ్డి చినమామగారైన బిరుదవోలు రాజశేఖరానంద గిరి ఉరఫ్ రాజారెడ్డి మరియు అతని సోదరులు, తల్లి వ్రాసుకొన్న రిజిష్టరు విభాగ పత్రము 29.7.47 ద్వారా సంక్రమించి సదరు భూములపై సంపూర్ణ హక్కు దారులై స్వాధీనాను భవములు కల్గియున్నారు. సదరు షెడ్యూలు దాఖలా ఆస్తి విషయమై రాజారెడ్డి తన రెండవ అన్న అయిన సుబ్బారెడ్డికి 24.5.1982 చిత్తూరు జిల్లా రిజిష్టారు వారి ఆఫీసులో వీలునామా వ్రాయించి యిచ్చి వున్నారు. సదరు సుబ్బారెడ్డి షెడ్యూలు దాఖలా ఆస్తిని తమ్ముడు రాజారెడ్డి అనుమతి లేకుండానే ఫోర్జరీ పత్రములతో అమ్ముటకు ప్రయత్నము చేయుచున్నందున సదరు వీలునామాను రద్దు పరచుచూ షెడ్యూలు దాఖలా ఆస్తి మేనేజిమెంటు విషయమై రాజారెడ్డి 27.7.1992 న నా క్లయింటు సి. అభిరామిరెడ్డికి రిజిష్టరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ వ్రాయించి యిచ్చి వున్నాడు. సదరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ పత్రము ద్వారా నా క్లయింటు షెడ్యూలు దాఖలా ఆస్తిని అమ్ముటకు, ఆదుమానములు ఉంచుటకు మరియు ప్రభుత్వముతో లావా దేవీలు, మున్సిపాలిటీలో లే అవుట్ ప్లాన్లు పొందుటకు సంపూర్ణ హక్కు దారుడై వున్నాడు. షెడ్యూలు దాఖలా ఆస్తి విషయమై పై తెల్పిన లావాదేవీలు జరుపటకు సుబ్బారెడ్డి గానీ, మరెవ్వరైనా గానీ అనర్హులు. సదరు లావాదేవీలు, నా క్లయింటును గానీ, రాజారెడ్డిని గాని బద్ధగించవు. ఎవరైననూ నా క్లయింటుకు తెలియకుండా షెడ్యూలు దాఖలా ఆస్తి విషయమై క్రయవిక్రయములు జరుపుకున్న యెడల నా క్లయింటు తీసుకొను సివిలు మరియు క్రిమినలు చర్యలకు బాధ్యులగుదురు.

### షెడ్యూలు

కనుపర్తి పాడు గ్రామం:1) సర్వే నంబరు 250, A.B.G.D. (కట్టువెంబడి చేను) విస్తీర్ణము య. 4.86 సెంట్లు 2) సర్వే నంబరు 712A (మరము చేను) విస్తీర్ణము య. 0.86 సెంట్లు 3) గురుదత్తా రైసు మిల్లు,4) పాకోలులు కమలమ్మ వద్ద రాజారెడ్డి విక్రయం చేసుకున్న యిండ్ల స్థలము మరియు దానిలోని కట్టడములు. 5) Door No. 2/100/1 గల మిద్దె యింటిలో పై మిద్దెతో సహా ఉత్తరపు వైపు సగభాగం మరియు అనుబంధిత పశువుల కొట్టము, గడ్డివాముల స్థలం, దిబ్బగుంట స్థలం, ఖాళీ దడ్డిస్థలము.

కొండాయపాళెం గ్రామం:1) సర్వే నంబరు 417/1 లో రాజేంద్రనగర్‌లోని ఖాళీ యిండ్ల ప్లాట్లు 26 నుండి 31, 41 నుండి 65, 71 నుండి 76, 78, 80, 83 మరియు 92 నంబర్లు.

టి. రామకృష్ణప్రసాద్, అడ్వొకేట్

అడ్వొకేట్, 2 వ సందు, మధ్యపతి వారి వీధి, నెల్లూరు

# నెల్లూరు గువ్వల్లు

## విహంగముడు

### జానకిరాంకు అనారోగ్యం

గనుల మంత్రి శ్రీ మాదాల జానకిరాం విపరీతమైన చెయిన్‌స్థితో బాధ పడుతున్నారు. కోయంబత్తూరు ప్రకృతి వైద్యం కూడా ఉపశమనం కల్పించినట్లు లేదు. ఆయన ఇటీవల నెల్లూరుకు రాకపోకలు తగ్గించడానికి కూడా ఈ అనారోగ్యమే కారణమట; రాజకీయం కాదు.

### ఎస్పి బదిలీ

నెల్లూరు పోలీసు సూపరింటెండెంట్ శ్రీ భూపతిబాబు తిరుపతి విజిలెన్స్ ఎస్పిగా బదిలీ అయ్యారు. ఆయన స్థానంలో శ్రీ టి. కృష్ణప్రసాద్ నియమితులైనారు. ఆయన ప్రస్తుతం పోలీసు బెటాలియన్ కమాండెంట్‌గా పనిచేస్తున్నారు.

భూపతిబాబు బదిలీ ఆకస్మికంగా జరిగింది. అది పరిపాలనా పరమైన నిర్ణయమా, లేక ఇతర కారణాలేమైనా వున్నాయా తెలియడం లేదు. శ్రీ భూపతిబాబు 1990 అక్టోబరు 26తేది నెల్లూరు వచ్చారు. అంటే రెండేళ్ళు కూడా కాకముందే బదిలీ అవుతున్నారన్నమాట. భూపతిబాబుగారు వ్యక్తిగా ఎంత సౌమ్యుడో, అధికారిగా అంత కరుకైనవారు. తిట్టకుండా, కొట్టకుండా, అరుపు ఆగం చేయకుండా పోలీసు యంత్రాంగాన్ని అదుపుచేయడంలో ఘటికుడాయన. నిజాయితీ, కరుకుదనం ఆయన్ను వివరాలలోకి ఈడ్చాయి. ఎస్పి నుంచి పని చేయమని వచ్చే ఒత్తిడి తట్టుకోలేక క్రిందిస్థాయి ఉద్యోగులు పోలీసు సంఘంద్వారా ఎదురుదాడి చేశారు. ట్రాఫిక్ అదుపులో భూపతిబాబు కృషి ప్రశంసనీయం. మూలపేట పోలీసు క్వార్టర్సుకు మోక్షం కల్గించింది ఆయనే. ముఖ్యమంత్రిని మెుగమాటపెట్టి జిల్లాకు 10కోట్ల విలువైన పోలీసు క్వార్టర్ల నిర్మాణాన్ని మంజూరు చేయించారు. హైవేలో పోలీసు పెట్రోలింగ్ ప్రవేశపెట్టి దారిదోపిడీలను నివారించడానికి గట్టి ప్రయత్నం చేశారు. టౌన్‌లో ప్రతిపోలీసు స్టేషన్‌కు వాహనాలు, ఆధునిక వైర్‌లెస్ వ్యవస్థ సమకూర్చారు. డ్యూటీ దగ్గర ఎంత ఖచ్చితంగా వుంటారో, ఉద్యోగుల స్వంత సమస్యల విషయంలో అంతే సానుభూతిగా వ్యవహరించేవారు. రిజర్వు ఇన్స్‌పెక్టర్ శ్రీ రాజశేఖర్ హఠాత్తుగా అనారోగ్యానికి గురైతే పోలీసు నిధుల నుంచి అప్పటికప్పుడు 20వేలు మంజూరు చేయించి ఇచ్చిన మానవతావాది. జిల్లాలో నక్సలైట్లు పెరగకుండా చేయడంలో భూపతి బాబు కృషి ఎంతైనా వుంది. నిశ్శబ్దంగా పనిచేసుక పోవడం తప్ప, ప్రచారం గ్రిచారం గిట్టని వాడు కావడంతో భూపతిబాబుకు సరైన పేరు రాలేదు. అటువంటి ఉన్నత ఆదర్శాలు, చిత్తశుద్ధి కల్గిన అధికారి వివాదాస్పదంగా జిల్లానుంచి వెళ్ళవలసి రావడం దురదృష్టకరం.

### రౌడీహత్య

కపాడిపాళెంలో పేరుమోసిన రౌడీ, యూత్ కాంగ్రెస్‌నాయకుడు శ్రీ దేవకుమార్‌రెడ్డి అనుచర ముఖ్యుడు అరవ ఆంతోని 26 తేది ఉదయం పట్టపగలు దారుణ హత్యకు గురైనాడు. సంతపేట కూరగాయల మార్కెట్ సెంటరులో టీ త్రాగి, కపాడిపాళెం వైపు నడిచి పోతుండినాడట. హజరత్తయ్య అనే మరొక స్థానిక రౌడి తన స్నేహితుడితో కలసి, స్కూటర్‌లో వచ్చి, వెనుక నుంచి గొడ్డలితో నరికి చంపి, పారిపోయాడట. హజరత్తయ్యకు డిష్‌యాంటినా వుందట. దాన్ని నడపడానికి తనకు రౌడీమామూలు చెల్లించాలని ఆంతోని పట్టుబట్టడంతో ఇద్దరి మధ్య వివాదం చెలరేగి ఈ హత్యకు దారితీసినట్లుంది. ఆంతోనికి స్థానికంగా ఇంకా చాలా వివాదాలతో సంబంధం వుంది. ఇదివరకొకసారి అతడిపై హత్యాప్రయత్నం కూడా జరిగింది. అప్పుడు వంటిపై 16కత్తిపోట్లు పడినా, బ్రతికి బయట పడ్డాడు; ఇప్పుడు రెండే రెండు గొడ్డలి ఘాతాలకు విఘాతుడైనాడు.

హంతకులింకా దరకలేదు;కేసు దర్యాప్తులో వుంది.

### అంకయ్య గౌడ్ శగం !

ఖర్మకాలి ఆయన్ను కాంగ్రెస్ వాడనే చెప్పుకోవాలి; ప్రజలచే ఎన్నికైన పొదలకూరు మండల ప్రజాపరిషత్తు మాజీ అధ్యక్షుడనే పరిచయం చేయాలి; ఏ కాంగ్రెస్ సభ జరిగినా అనివార్యపు వుపన్యాసకుడనే అనాలి; ప్రతివేదిక మీదకు ఆహ్వానింపబడే గౌరవనీయుడనే వాస్తవాన్ని కాదనడానికి లేదు; ఎంతో మంది ముఖ్యులకు, ధన వస్త్రవాహనాది సహాయ సంపత్తితో కొంతంత అండగా వుంటున్న వాడనే నిజాన్ని మరుగు పరచలేము; రాపూరు తాలూకాలో నక్సలైట్లను ఛూఛూ మంత్రంతో శాంత పరచుకున్న అసాధ్యుడని ఢంకా బజాయించి చాటితీరాలి–

అటువంటి మహా ఘనత వహించిన శ్రీ అంకయ్య గౌడ్ గొట్ల పాళెంలోని తన కాపుడు సారాయి సామ్రాజ్యాన్ని ఎక్సయిజ్ శాఖ శత్రువులు ముట్టడించిన పుటి నుండి, ఆ సంఘటనకు సంబంధించి తన ఆధీనంలో వున్న గజకర్ణ గోకర్ణ విద్యలలో దేనికీ లొంగకుండా, కలెక్టరు శ్రీ కె.రాజా దృఢంగా వ్యవహరిస్తున్నప్పటి నుంచి, శాసన సభ్యులుగాని, ముఖ్యమంత్రి గాని తన రక్షణకు రానప్పటి నుండి రెచ్చిపోయి మాట్లాడుతున్నారు; బెదరిస్తున్నారు; సవాళ్లు విసురుతున్నారు; తనను అడిగే వాడే లేనట్లుగా, తనను అదుపులో పెట్టేవాడే లేనట్లుగా, తనకు ఎదురే లేనట్లుగా యుద్ధ భేరీలు మ్రోగిస్తున్నారు.

జిల్లాలో తన బలప్రదర్శనకు 'అంకయ్య గౌడ్' ఏర్పాటు చేసుకున్నదే గత మహాసభ. తన సైన్యాన్ని చూపి అందరినీ బెదరగొట్టాలనేదే అతని సంకల్పం. ఆ మహా సభలో గౌడ్ గారు చేసిన ప్రసంగం పాదా అయిందిగా, అవి మాపివంటిదిగా తెలిగ్గా తీసుకోడానికి వీల్లేదు. సారాయి పాటలు పెట్టమని కలెక్టరును ఛాలెంజ్ చేశారు; పెట్టలేవని ఆయన్ను బెదరిస్తున్నారు, సెలవులో వెళ్లమని హెచ్చరిస్తున్నారు. కలెక్టరును ఇంత బహిరంగంగా సవాల్ వేయడమంటే, ప్రభుత్వం పట్ల ధిక్కారంగా వ్యవహరించి నట్లే అవుతుంది. సారాయి పాటలు పెడితే రణరంగ మవుతుందని ఇంకు గొంకు లేకుండా అంటున్నాడంటే, నాటు బాంబులు నాటు తుపాకీల వంటి ఆయుధ సామగ్రి కొంత సైన్యాన్ని కలిగిన అతను ఏ

కొరవ 7 పేజిలో





## గుడివాడ సబ్ కోర్టులో

OS 5/77 EP 16/91

S.B.I పరమట Rept by its Branch Manager - Dhr

1.M/sఅచల్ యింజనీరింగ్ కంపెనీ Repby its Proprietor. సోమిశెట్టి వెంకటేశ్వర రావు (Died), 2.కొండుబోయిన అన్నపూర్ణమ్మ, 3.కొండుబోయిన పాండురంగారావు, 4.కొండుబోయిన లక్ష్మీనారాయణ, 5.స్వామిశెట్టి ప్రమీలాదేవి (Died), 6.స్వామిశెట్టి భక్తవత్సలరావు, 7.స్వామిశెట్టి చక్రవర్తి, 8.కర్లి పద్మ ప్రసన్నదేవి, 9.స్వామిశెట్టి మోహన్ మురళిధర్

Jdrs.

పై నెంబరు డిక్రిబాకీ క్రింద దిగువ షెడ్యూలు దాఖలా ఆస్థి పై కోర్టువారి ఎదుట 7-9-92తేది ఉదయం 10 1/2గంటలు నుంచి వేలము జరుగును. కావున కావలసిన వారు పాడుకోవచ్చును.

### షెడ్యూలు

కృష్ణ డిస్ట్రిక్ట్ గుడివాడ సబ్‌రిజిస్ట్రారు వారి యిలాకా చినలింగాల గ్రామములో JDRS స్వాధీన హక్కు భుక్తములో యుండి యీ డిక్రి బాకీ క్రింద హామీగా యుండి వేలము కావలసిన ఆస్థి వివరం

1.R.S.N0. 135/10 య.0-33సెంట్లకు హద్దులు.
EAST: Land of A.కృష్ణారావు. SOUTH: 2nd item Below WEST: Land of A.వెంకట్రామయ్య NORTH: Land of A.వెంకట్రామయ్య . ఈ హద్దుల మధ్య య.0.33సెంట్లు.

2.R.S.No. 136/5 AC 0=40 సెంట్లకు హద్దులు
EAST: LAND OF A.కృష్ణారావుSOUTH : 3rd Item Below; WEST : Land of A. వెంకట్రామయ్య; NORTH : 1st Item stated above Land of A.వెంకట్రామయ్య ఈ హద్దుల మధ్య య.0.40సెంట్లు.R.S. No. 3.136/4 AC 1-13 సెంట్లు కు హద్దులు
EAST : Land of A.కృష్ణారావు;SOUTH:బాపెట్‌కోడ ;WEST : 4th Item Below NORTH: Land of A.వెంకట్రామయ్య మరియు 2nd Item Below.

4.R.S.N0. 136/3 AC 0.34 సెంట్లు కు హద్దులు
EAST : 3rd Item Below SOUTH: Bapat Code; WEST : Land శ. పిచ్చమ్మ వగైరా North: Land of A.వెంకట్రామయ్య ఈ హద్దుల మధ్య 0=34 సెంట్లు.

1 to 4 అయిటము కలసి య. 2.20 సెంట్లు

| DHR Value | అమీనా విలువ |
|---|---|
| 1. RS. 5000/- | 1. Rs 14000/- |
| 2. Rs.5000/- | 2.Rs.15000/- |
| 3. Rs 5000/- | 3.Rs.25000/- |
| 4. Rs.5000/- | 4.Rs.14000/- |

G.SR అంజనేయులు
అడ్వకేటు



45 వ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా 15.8.92 లో నెల్లూరు వాకలి వీధి మహాలక్ష్మమ్మ గుడి వద్ద గల 'ప్రభాత్ ఇంగ్లీషు మీడియం స్కూలు' నందు పతాకావిష్కరణ గావిస్తున్న ప్రిన్సిపాల్ శ్రీ వై.వి. కృష్ణయ్య. విద్యార్థులు.

## జిల్లా వార్తలు

5 పేజీ తరువాయి

నిర్వహించాలని కోరారు. ఎమ్మార్వో శ్రీ ఎం.సుధాకర్ 'పావనిర్' ను వివరాల చేశారు. అసోసియేషన్ ఛైర్మన్ శ్రీ వై. విద్యాసాగర్, మేనేజర్ శ్రీ ఆర్. సుందరం తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### సమస్యలతో సతమతం

అల్లూరు మండలంలో పని చేస్తున్న ఉపాధ్యాయుల సమస్యలు చాలా కాలం నుంచి పెండింగులో ఉన్నా అధికారులు పట్టించు కోవడంలేదని ఎ.పి.టి.ఎఫ్. జిల్లా అధ్యక్షుడు శ్రీ కె. గాలయ్య విమర్శిస్తున్నారు. 86లో ఫ్యాప్టో ఆధ్వర్యాన జరిగిన సమ్మెలో పాల్గొన్న ఉపాధ్యాయులకు, లీవ్‌నాట్ డ్యూగా మంజూరు చేసిన జీతం చెల్లించమని ఉత్తర్వులిచ్చి ఆరు సంవత్సరాలైనా పట్టించుకోవడం లేదని, హెడ్మాష్టర్లకు అలవెన్సుగా 20రూపాయలు హెచ్చించి నెలలు గడిచినా మండలంలో వీటిని చెల్లించడం లేదని 4సంవత్సరాల సర్వీసు కల్గిన వారిని రెగ్యులర్ చేయడం లేదని ; అదనపు అర్హతలున్న వారికి ఇంక్రిమెంట్లు ఇవ్వడంలేదని గాలయ్య ఆరోపణ. ఈ సమస్యలను ఎమ్మార్వో పరిష్కరించక పోతే ఆందోళన బాట నడవవలసి వస్తుందని హెచ్చరిస్తున్నారు శ్రీ గాలయ్య. ఎమ్మార్వోగారు తెగేదాక తాడు లాగుతారనుకోము!

### రాపూరు రోడ్డు అధ్వాన్నంగా వుంది

మండల కేంద్రమైన రాపూరు గ్రామంలోని మెయిన్‌రోడ్డు అధ్వాన్నంగా ఉంది. రాపూరునుంచి పెంచలకోన, నెల్లూరుకు వెళ్ళే ట్రాఫిక్ అంతా ఈ రోడ్డుమీదనే నడవాలి! బజారు వీధి గుండాపోయే ఈ అధ్వాన్నపు రోడ్డును, సిమెంటు రోడ్డుగా మార్చను 89లో రోడ్ల మంత్రిగా ఉన్న స్థానిక శాసన సభ్యుడు శ్రీ ఆనం. రామనారాయణరెడ్డి 4లక్షల రూపాయలు మంజూరు చేయించారు. కాని కాంట్రాక్టరు రోడ్డుపై మెటల్ మాత్రం వేసి చేతులు దులుపుకొన్నాడు. ప్రస్తుతం వేసవి కాలంలో దుమ్ము రేపుతూ; వర్షాకాలంలో బురద స్ప్రే చేస్తున్న ఈ రోడ్డును గూర్చి పట్టించుకొనే నాథుడే కరువయ్యారు.

### బుచ్చిలో డి.ఐ.జి

గుంటూరు రేంజి డి.ఐ.జి శ్రీ కె. అరవిందరావు గురువారం బుచ్చిరెడ్డి పాళెం పోలీస్‌స్టేషన్‌ను సందర్శించి స్టేషన్‌లోని రికార్డులను తనిఖీ చేశారు. జిల్లాపోలీస్ సూపరిం శ్రీ భూపతిబాబు, రూరల్ డి.ఎస్.పి. శ్రీసత్యకీర్తి కూడా డి.ఐ.జి వెంట వచ్చారు.

### రోజ్‌గార్ పనుల సమీక్ష

బుచ్చిరెడ్డిపాళెం మండల ప్రజా పరిషత్ రోజ్‌గార్ పనుల ప్రత్యేక సమీక్షా సమావేశం గురువారం ప్రత్యేకాధికారి శ్రీమతి. బి. ఉమాలక్ష్మి అధ్యక్షతన జరిగింది. మండల్ల పరిధిలోని గ్రామాల్లో జరుగుతున్న పనుల వివరాలను, సమస్యలను ప్రత్యేకాధికారి సర్పంచ్‌లను అడిగి తెలుసుకున్నారు. సమావేశంలో ఎమ్మార్వో శ్రీ సి.ఎస్.సుబ్రహ్మణ్యం కూడా పాల్గొన్నారు.

### మహా సంప్రోక్షణ తుమ్మగుంట

తుమ్మగుంట గ్రామంలోని అతి పురాతన దేవాలయమైన నారాయణాలయం పునరుద్ధరింప బడిన సందర్భాన్ని పురస్కరించుకొని బుధవారం సంప్రోక్షణ కార్యక్రమం జరిగింది. ఆగమశాస్త్ర పండితులు శ్రీ జరవత్తూరు విశ్వనాథ శ్రౌతుల ఆధ్వర్యంలో దీన్ని నిర్వహించారు.

### ఆస్పత్రి ఉద్యోగి కుటుంబానికి చేయూత

బుచ్చిరెడ్డి పాళెం ప్రభుత్వ వైద్యశాలలో సూపర్ వైజర్‌గా పనిచేస్తూ ఇటీవల ఆకస్మాత్తుగా మరణించిన వై. రమణారెడ్డి కుటుంబంలో ఒకరికి ఉద్యోగం ఇస్తామని జిల్లా వైద్యాధికారి శ్రీ జి.సి.నారాయణ హామీ ఇచ్చారు. బుధవారం రాత్రి ఆసుపత్రి ఆవరణంలో జరిగిన రామిరెడ్డి సంతాప సభలో ఈ విషయాన్ని ఆయన వెల్లడించారు. బుచ్చి ఆసుపత్రి అభివృద్ధి మంజూరైన 14లక్షల రూపాయల నిధులతో భవనం నిర్మాణ పనులు త్వరలో మొదలు పెడతామని వైద్యాధికారి చెప్పారు.

## అంకయ్య గౌడ్

ఆరవ పేజీ తరువాయి

ప్రజావ్యతిరేకతకు లోనై 11మంది కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఓడిపోవడం ఖాయం. కాంగ్రెస్ పార్టీ సంక్షేమం కోసం సారాను రద్దు చేయాలి. కలెక్టరు సారా పోటీలు పెట్టలేదు. ఆయన సెలవు పెట్టి పోవడం మంచిది. లేకుంటే రణరంగమేనని గర్జించారు. కల్లు గీత కార్మికుల సంఘం ఏర్పాటు చేసి దాని అభివృద్ధికి పాటుపడిన నల్గొండ ఎమ్పీ శ్రీధర్మభిక్షం మాటలు ఎవరూ వినకపోయే సరికి ఆయన ఉపన్యాసం ముగించారు.

నిర్వాహకులు ప్రకటించినట్లు సభలో పాల్గొన వలసిన సర్దార్ గౌతులచ్చన్న అనారోగ్య రీత్యా రాలేక పోయినట్లు ఆయన కుమారుడు, సోంపేట ఎమ్మెల్యే శ్రీ శ్యామ సుందర శివాజీ సభలో చెప్పారు.

సభకు ముందు లారీలు, ట్రాక్టర్లలో తాటి, ఈతచెట్లకు కుండలు కట్టి, టౌన్‌లో పెద్ద వూరేగింపును నిర్వహించారు. వి.ఆర్.కాలేజి మైదానంలో జరిగిన ఈ సభకుజనం విరగబడి వచ్చారు. ఆ జనవాహినిని చూచే సరికి వుపన్యాసకుల ఒళ్ళుమరచి మాటాడినారా అనిపించింది. గౌడుల సభకదా- కల్లు, సారా సువాసనలు సహజమేగదా ?

## మెడికల్ కాలేజీలు

మొదటి పేజీ తరువాయి

కాని జరిగే నష్టమేమీ లేదన్నది ఆయన నిశ్చితాభిప్రాయం. రాజకీయ పరమైన ఆందోళనకు మద్దతు నిస్తున్నపలువురు ప్రతి పక్ష నాయకులు సైతం అంతరంగికంగా కాలేజీల ఏర్పాటు పట్ల సానుకూలత వ్యక్తం చేస్తున్నారని ఆయన చెప్తున్నారు. మేలు తప్ప, కీడు జరగని ఒక మంచి కార్యక్రమాన్ని ఎవరో కొందరు వ్యతిరేకిస్తున్నారన్న కారణంగా రద్దు చేయడం తన కిష్టం లేదని ముఖ్యమంత్రి స్పష్టంగా చెప్తున్నారు.

అందువల్లే హై కోర్టు తీర్పు ప్రతికూలంగా వచ్చినా కాలేజీలు నడపడానికి గల అవకాశాలను ఇప్పటి నుంచే పరిశీలిస్తున్నారు. క్యాపిటేషన్ ఫీజు వసూలు చేయరాదని హై కోర్టు తీర్పు చెప్తే, దాన్ని శిరసావహించి, ఇతర మార్గాల ద్వారా కాలేజి నిర్వహణ వ్యయం సేకరించాలన్నది ప్రయత్నం. వంద సీట్లను మెరిట్ ప్రాతిపదికపైనే కేటాయించి, అదనంగా మరొక 25,30 సీట్లు మంజూరు చేసి, వాటిని విదేశాలలోని భారతీయులకు క్యాపిటేషన్ పద్ధతిపై కేటాయించడం ద్వారా నిధులు సేకరించాలన్నది ఒక ఆలోచన. విదేశాలలో మెడికల్ విద్య చాలా ఖరీదైనది. క్యాపిటేషన్ ఫీజు లక్షల్లో కట్టినా, ఇండియాలో చదవడమే వారికి చవక. అయితే సరైన ప్రాథమిక వసతులు లేని, మెడికల్ కౌన్సిల్ గుర్తింపు లేని కొత్త కాలేజీలలో డాలర్లు డిపాజిట్ చేసి ఎన్‌ఆర్‌ఐలు తమ పిల్లల్ని చదవిస్తారా అన్నది సంశయం.

హైకోర్టు తీర్పును బట్టే, ఇంజనీరింగు కాలేజీల మంజూరు ఆధారపడి వుంటుంది. ఇప్పుడున్న కాలేజిలలో యాజమాన్యం కోటాను సైతం తీర్పు వెలువడే వరకు ప్రక్కన పెట్టబోతున్నారు. కొత్త కాలేజిలు మంజూరు చేయకుండా యాజమాన్యం కోటా అమలు పరిస్తే మెరిట్ విద్యార్థుల సీట్లు సగానికి తగ్గిపోతాయి. రిజర్వేషన్ సీట్లు తగ్గుతాయి.

## చిత్తరంజన్‌దాస్

వె ఐద టి పేజి తరు వ

వర్య ద్వారా ప్రభుత్వంలో క్రమశిక్షణ నెలకొల్పాలన్నది జనార్దన రెడ్డి సంకల్పం. పన్నెండు మంది మంత్రులు బహిరంగంగా తిరుగుబాటు చేసి, రాజీనామాలు సమర్పించిన తర్వాత, వారిని యధాతథంగా తన క్యాబినెట్‌లో కొనసాగించవలసి రావడం ముఖ్యమంత్రికి ఏ మాత్రం పరువు కల్గించే విషయం కాదు. దీనివల్ల పార్టీలో, అధికార వర్గాలలో, ప్రజలలో ప్రభుత్వం పరపతి, ప్రతిష్ఠ దెబ్బతింటాయి. తాను తెడ్డెం అంటే, కాదు ఎడ్డెం అనే మంత్రులను పెట్టుకొని ఏ ముఖ్యమంత్రి ప్రభుత్వం నడపగలరు? ప్రధాని పర్యటన ముగియగానే ఈ విషయంలో అమీతమీ తేల్చిపారేయాలన్న పంతంలో వున్నారు జనార్దన రెడ్డి.

### ఎమ్మెల్యేల సంఖ్య ముప్పయ్ రెండే!

రేపు (29 తేది) నగరానికి రానున్న ప్రధానమంత్రికి సమర్పించడం కోసం చెన్నారెడ్డి, వైఎస్‌లు కలిసి ఒక వినతి పత్రం తయారు చేస్తున్నారు. దాన్ని వినతి పత్రంగా కాక, జనార్దన రెడ్డి ప్రభుత్వంపై ఛార్జిషీట్‌గా రూపొందించాలని వారి ప్రయత్నం. 'మీరు చెప్పిన ప్రకారం, మీ మాటకు గౌరవమిచ్చి ఇంత కాలం వేచి వున్నాం; ఇంకా ఓపిక పడితే రాష్ట్రంలో పార్టీ నాశనమై పోతుంది; అందువల్ల తక్షణం నాయకత్వం మార్చండి; లేకుంటే మేము ప్రత్యక్ష ఆందోళనకు దిగవల వుంటుంది'' అన్నది ఆ మెమొరాండం సారాంశం! దీనిపై సాధ్యమైనంత ఎక్కువ మంది ఎమ్మెల్యేల చేత సంతకాలు పెట్టించాలని ప్రయత్నించారు. కాని, ఎంత సాగదీసినా జాబితా 32 దాటలేదు. అప్పటికి చెన్నారెడ్డి గారు స్వయంగా పలువురు ఎమ్మెల్యేలకు ఫోన్లు చేసి మాట్లాడారు. ముఖ్యమంత్రి కార్పొరేషన్ ఛైర్మన్ పదవి ఇచ్చిన మంగళ గిరి ఎమ్మెల్యే శ్రీ గోలి వీరాంజనేయులు చేత బలవంతంగా పత్రికా ప్రకటన చేయించారు. ఇంకొక ప్రక్క నాదెండ్ల భాస్కరరావు సైతం చెన్నారెడ్డి పక్షం చేరారు. నాయకత్వం మారితే తనకు ఛాన్సు చిక్కక పోతుందా అన్నదాయన ఆశ.

## సింహపురి

4 పేజీ తరువాయి

స్వచ్ఛంద సేవా సంస్థ 'జాగృతి' సెప్టెంబరు 6వ తేదీ నవాబు పేటలోని తమ కార్యాలయంలో ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేస్తుంది. ఉద్యమానికి ఊపిరి పోసే కార్యక్రమం రూపొందించను అక్షర ఉద్యమంలో పాల్గొన్న వలంటీర్లు, గైడ్లు, మహిళలు , స్వచ్ఛంద సేవకులు ఈ సమావేశంలో పాల్గొనాలని సంస్థ ఎనిమేటర్ వి. మధుసూధన రావు కోరుతున్నారు.

### జనతాదళ్ జిల్లా మహాసభ

జనతాదళ్ పార్టీ జిల్లా మహాసభ సెప్టెంబర్ 9 తేదీ టౌన్‌హాలులో జరగబోతున్నది. పార్టీ జాతీయ నాయకుడు శ్రీ ఎస్. జైపాల్ రెడ్డి, రాష్ట్ర శాఖ అధ్యక్షుడు శ్రీ కాతా జనార్దనరావు, శాసనసభలో పార్టీ ఏకైక సభ్యుడు శ్రీ సి. నర్సిరెడ్డి పాల్గొంటారు. సభకు పార్టీ సభ్యులు, సానుభూతిపరులు విచ్చేయాలని పార్టీ జిల్లా అధ్యక్షుడు శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్ కోరుతున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజి తరువ

సారాయి వుత్పత్తి రవాణా దారుడికి ఇంత ధైర్యసాహసాలు ఎట్లా వచ్చాయి? ఏ శక్తుల అండ, బలాన్ని చూచుకొని గౌడ్ గారు ఇట్లా పెట్రేగి పోతున్నారు?

ఏమైనా అంకయ్య గౌడ్ ప్రసంగాలు ప్రమాదకరంగా, ఆక్షేపణీ దౌర్జన్యానికైనా, హింసా కార్యక్రమానికైనా, ప్రత్యక్షదాడికైనా తెగించవచని ఎట్లా భావించడం? అసలు ఒక కాపుదు యంగా వుంటున్నాయి. ఇవి వుదాసీనంగా త్రోసి వేయదగినవి కావు; వుపేక్షించ దగినవీ కావు; ప్రభుత్వం తీవ్రంగా పరిగణించి ఈయన కథ కమామీషు ఏమిటో తెలుసుకోవడం, తేల్చుకోవడం, ఈ ప్రేలాపనలకు ఫుల్ స్టాప్ పెట్టించడం అవసరం.

మా కొక అనుమానం కలుగుతున్నది – గౌడ్ గారు మరొకమారు 'నాసా' వీరుడుగా విఖ్యాతి చెందాలనే తలంపుతో ఇట్లా తీవ్ర పదజాలంతో మాట్లాడుతున్నాడా అని!

### మరణాలు

నెల్లూరు – నవ్యకళా భారతి సంగీత నృత్య పాఠశాల నిర్వాహకుడు, లైసెన్స్ వున్న బిల్డింగు సర్వేయరు, వుత్సాహవంతుడైన హరిజన యువకుడు శ్రీ ఎం. రాజారావును (46) 21 తేది సాయంత్రం పెన్నా బ్రిడ్జి మీద టవున్ బస్ ఒకటి బలి తీసుకున్నది. దారుణమైన మరణం. అతనికి భార్య, నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

కోవూరుకు పోయి స్కూటర్‌లో తిరిగి వస్తున్నాడట; 6 నెంబరు బస్సు వెనుకగా వస్తుండగా, వెనుకనే 5 వ నంబరు టవున్ బస్సు దురుగ్గా వచ్చి అతన్ని హతం చేసింది; రాజారావు అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు.

మూడేళ్ల క్రితం ఉప్పు సత్యాగ్రహ పునఃప్రదర్శన జరిగినప్పుడు తన బృందంతో నెల్లూరు నుండి మైపాడు వరకు దేశభక్తి గీతాలు గానం చేస్తూ వుత్తేజకర వాతావరణాన్ని కల్గించాడు రాజారావు. ఒక సంవత్సరం 'జమీన్‌రైతు' రామనాయుడు గారి జయంతిలో నాయుడుగారి ''మా కొద్దీ జమీందారీ పొందు'' అనే గీతానికి సంగీతాన్ని గూర్చి వాద్య సమ్మేళనంతో విద్యార్థినుల చేత ఆలపింప జేశాడు. నెల్లూరులో ఎక్కడ సంగీత నృత్య సాంస్కృతిక కార్యక్రమం వున్నా అక్కడ రాజారావు వున్నట్లే లెక్క. డబ్బు కోసం చేసే వాడు కాదు, ఆ కళల పట్ల అతనికి అంతటి మక్కువ. ఒక విలువైన ఎంతో భవిష్యత్తు వున్న ఒక ప్రాణాన్ని బలి గొన్నది ఆ బస్సు.

రాజారావు కుటుంబానికి మా సానుభూతి.

* * *

డాక్టరు రామచంద్రారెడ్డి గారి ప్రజా వైద్యశాలలో సర్జన్‌గా 1983 నుండి పనిచేస్తుండిన డాక్టర్ ఎస్.వి.ఎస్. ప్రసాద్ (42) లివర్ వ్యాధికి చికిత్స పొందుతుండి, 24 తేది అకాల మృత్యు వాత బడినారు. ఆయనకు భార్య, ఒక కుమారుడు, ఒక కుమార్తె వున్నారు.

శ్రీ ప్రసాద్ మంచి సర్జన్ గానే కాదు, కళాకారుడుగా, సంఘ సేవకుడుగా, ముఖ్యంగా రక్తదానోద్యమంలో చాలా కృషి చేస్తూ, ఎంతో అభిమానాన్ని చూరగొన్నాడు. నెల్లూరీయుడు కాకపోయినా, నెల్లూరీయుడని పించుకున్నాడు. డాక్టర్ ప్రసాద్ మరణానికి సింహపురి స్వచ్ఛంద రక్తదాతల సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీ సి.హెచ్. రాధాకృష్ణమూర్తి, శ్రీ తిక్కవరపు సుకుమారరెడ్డి గారలు తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నారు.

* * *

ట్రంకురోడ్డులో ఒకప్పుడు బాంబేడైయింగ్ వంటి ప్రసిద్ధ వస్త్ర వ్యాపార షోరూంలు నిర్వహించిన మాజీ రైల్వేఉద్యోగి శ్రీ బి.కాళిదాసు 22తేది మద్రాసు అపోలో ఆస్పత్రిలో మరణించారు. 13తేది ఉదయం సుబేదారుపేట కూడలిలో స్కూటర్‌పై వెళ్తూ, లారీకి ఢీకొని క్రిందపడ్డాడు. ప్రమాదకర దెబ్బలేమీ తగలలేదు. ముందు జాగ్రత్త కోసం మద్రాసు అపోలో ఆస్పత్రిలో చేర్పించారు. వారూ ప్రమాదం లేదని , డిశ్చార్జి చేస్తామని చెప్పారట. ఆరోజే ఉన్నట్టుండి కన్నుమూశారు.

కళ్యాణి ఫిలింస్‌లో ఆడిటింగ్ విభాగంలో పనిచేస్తున్న శరత్ ఆయన కుమారులలో ఒకరు. వారి కుటుంబానికి మా సానుభూతి.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 16.4అ |
| సర్వేపల్లి | 2.4అ |
| నెల్లూరు చెరువు | 11.65అ |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలకులు | | |
| | 9672 | 3700/- |
| | 9674 | 3800/- |
| | బి.ఆర్20 | 3,000 |
| సున్నాలు పాతవి | | 2600 |
| సున్నాలు కొత్తవి | | 2600 |
| మొలగొలుకు బియ్యం 70 కి | | 525/- |
| బంగారు సవర (8 గ్రా) | | 3120/- |
| వెండి 10 గ్రా | | 80 |

## సణుగుడు

4 పేజీ కొరవ

త్రిప్పితే చిల్లరావు. పాలు చూద్దామంటే నీళ్లు తప్ప మరేదీ కన్పించదు. పిల్లల్ని బడికి పంపడానికి ఫీజులంక బాధ. తినే ప్రతి వస్తువు ధరలూ ఆకాశంలో తిష్టవేస్తున్నాయి. కంటి నిండా నిద్రపోదామన్నా దోమలు దాన్ని కుదరనివ్వడంలేదు. ఈ సమస్యల వలయంలో చిక్కుకొని, అశాంతిపాల్తై, మనశ్శాంతి కోల్పోతున్న నగటు జనావళి కనీసం సారా, విస్కీలు త్రాగైనా సుఖంగా నిద్రపోతారని, కష్టాలు మర్చిపోయి మత్తులో తులతూగుతారని, కలల ప్రపంచంలో మునిగి తేలుతారని ప్రభుత్వం తీర్మానించింది. తన ప్రజల శ్రేయస్సుకోసం ఇంతటి శ్రేయోపథకం చేపట్టడం నిజంగా మహదానంద పడాల్సిన సంగతే కదా!

త్రాగి త్రాగి జనం ఒళ్లు కుళ్ళబెట్టుకొంటే నష్టం ఎవరికి?

అంతమాత్రం ఆలోచన లేనిదను కొన్నావా- మన సర్కారు ఏరతనం! అందుకనే ఊరికొక మెడికల్ కాలేజీ పెట్టించి, ప్రతి కాలేజీకి ఒక ఆస్పత్రి కట్టింపజేసి, శవాకారంలో పడివుండే మనిషిని కూడా మరొక సీసా సారా త్రాగగల్గే ఆరోగ్యవంతుల్ని చేసి పంపడానికి తగిన ఏర్పాట్లు జరుగుతున్నాయి.

అయితే మనమంతా తలొక గ్లాసు త్రాగక తప్పదంటావ్?

దేశభక్తిగల ప్రతి పౌరుడూ శక్తికొద్దీ గ్లాసులు గ్లాసులు, సీసాలు సీసాలు సారాయి పట్టించడం తప్పనిసరి! జాతీయాభిమానానికి అదొక చిహ్నం. మనం సారా త్రాగకుంటే ప్రభుత్వ ఖజానాలో కాసులు రాలవు; కాసులు లేకుంటే ప్రభుత్వం ప్రాజెక్టులు కట్టలేదు; ప్రాజెక్టులు లేకుంటే కంట్రాక్టర్లుండరు; కాంట్రాక్టర్లు లేకుంటే క్లయిమ్‌లుండవు; క్లయిమ్‌లు లేకుంటే ప్రభుత్వాన్ని నడిపే వారికి ఎన్నికల ఖర్చుకు నిధులుండవు; సారాయి అమ్మకాలు లేకుంటే అసలు సారాయి కాంట్రాక్టర్లే వుండరు. వారే లేనప్పుడు జనానికి చదువు చెప్పడానికి, ఆరోగ్యం కల్పించడానికి మెడికల్ కాలేజీలు, ఆస్పత్రులు పెట్టేవారుండరు. ఒక గ్లాసు సారాతో ఇంత విస్తృతమైన ప్రజా సేవా కార్యక్రమాలు నిరంత రాయంగా జరిగిపోయే వీలున్నపుడు, త్రాగవద్దని వారిని బొక్కలో త్రోయమనడం తప్పా? మద్యపాన నిషేధోద్యమాలు నడిపే వారిని దేశద్రోహులుగా చిత్రించడం నేరమా?

ఇప్పటికి జ్ఞానోదయం అయింది వాకు; సారాయి ప్రచార-కవి సమ్మేళనంలో నా పేరూ ఇరికించు- రాష్ట్ర రాజదర్బారు సర్వసాహిత్య సార్వభౌములు శ్రీ శ్రీశ్రీ. సి. నారాయణ రెడ్డి గారి నడిగి ప్రాసలతో కూడిన పద్యపంక్తులు నాలుగు వ్రాయించుకునివస్తా; ఫస్ట్ ప్రైజు కొట్టేసి, నేనూ ఏదో ఒక ఆస్థాన విద్వాంసత్వం అడిగి తీసుకొంటా!

"సారా త్రాగండిబాబు

సర్కారు శ్రేయస్సు కోరండిబాబు!"

* * *

ప్రధానమంత్రి అంటే ఎవరు?

ఒకటో క్లాసు పిల్లవాడినడిగినా చెప్తాడు- ఎవరో!

నేనడిగేది పేరుకాదు- పదవి స్థాయి ఏమిటి అని!

అదీ ఫస్ట్‌క్లాసు స్టూడెంట్‌కు వేయాల్సిన ప్రశ్న!

అయితే గూడూరు రిజిస్ట్రార్ ఆఫీసులో పనిచేసే వారెవరూ కనీసం ఒకటో క్లాసు కూడా చదవలేదంటావా?

చదువు లేకుంటే ఉద్యోగాలెట్లా వస్తాయి?

పోనీ వారి చదువులో ప్రధానమంత్రి అంటే ఎవరో ఎప్పుడూ చెప్పలేదు కాబోలు అయ్యవార్లు!

ఎందు కొచ్చింది నీకా సందేహం?

సందేహం కాదు - స్వంత అనుభవమే! ఎన్‌కంబరెన్స్ సర్టిఫికేట్ అనబడే కాగితం ముక్క కోసం గూడూరు రిజిస్ట్రార్ ఆఫీసు కళ్తె-నామిత్రుడ్నిపీక్కొని తిన్న వైనం వింటే నీకూ వస్తుందా సందేహం! ఆ సర్టిఫికేట్ ఇవ్వడానికి సర్కారుకు 36రూపాయలు చెల్లించాలట; రిజిస్ట్రార్ ఆఫీసు సాంప్రదాయం ప్రకారం చలానా ఎంతమొత్తమో, అంతే మొత్తం లంచంగాముందు ఇస్తే తప్ప ఆ దరఖాస్తును పెద్ద అధికారి చూడడట. పరమ పవిత్రమైన ఈ కార్యాలయ నియమం పాటించి, 72రూపాయలూ ముట్టచెప్పి, ఆ సర్టిఫికేట్ సాయంత్రానికి దయచేయించమని అడిగాడట. లాండ్రీలో అర్జెంట్, ఆర్డినరీ గుడ్డలుతుకులకు రేట్లున్నట్లు, రిజిస్ట్రార్ ఆఫీసులోనూ వుంటాయన్న లోకజ్ఞానం లేకపోవడం ఆ మిత్రుడి తప్పు! ఆ మాట వినగానే పెద్ద దొరవారు వెంటనే అప్లికేషన్ చూసి, సాయంత్రానికి కావాలంటే మరొక రెండు వందలిమ్మన్నాడట; అదివ్వకుంటే నేను రేపటి నుంచి సెలవు పెట్టిపోతున్నాను కాబట్టి, వారం తర్వాత కన్పించమన్నాడట. ఏడ్చుకుంటూ ఆ రెండు వందలూ ముట్టచెప్పే సరికి, అరగంటలో కాగితం చేతికివచ్చేసింది. ఇక్కడి వరకు జరిగిన కథలో వింతలేదు, విస్మయ పడాల్సిన పనీలేదు. కాని, సర్టిఫికేట్‌పై సంతకం పెడుతూ, ఆ పెద్దపెద్ద సారువాడు వేసిన ప్రశ్నలే నీబోటి లోకజ్ఞాన శూన్యులు వినితీరాలి!

"ఈ దరఖాస్తు లో వున్న పేరు

ఫలానానదే?

అవును సార్!

ఈ మధ్యేదో పదవి వచ్చిందని

సన్మానాలు చేసిందియననేనా?

అవునుసార్!

ఆ సన్మానానికి ప్రధానమంత్రి కుమార్తె వచ్చిందని పత్రికలలో చదివాను. నిజమా?

అవును సార్!

ఆ ఫలానాయన ప్రధానమంత్రికి

అంత దగ్గరివాడా?

అవును సార్!

నేను చెప్పిన, రెండు వందలు ఆటెండరు చేతికి ఇచ్చావా?

ఇచ్చాను-సార్!

అయితే, సర్టిఫికేట్ తీసుకొని

పో!

థ్యాంక్యూ సార్"

ఇదీ ఆ సంభాషణా సరళి!

ప్రధానమంత్రి సన్నిహితులని తెలిసి, అసలు రేటుకు ఏడింతల లంచం దండిన ఆ అధికారి చదువు వచ్చినవాడేనని నమ్మడమెట్లా?

పిచ్చివాడా- లోకజ్ఞానం లేనిది నాకు కాదు-నీకు! ప్రధాన మంత్రిఎవరో తెలును కాబట్టే ఆ అదనపు లంచం. గోచీ, మొలతాడు లేని వాడి దగ్గర తీసుకొనే లంచానికి ఎవర్నిచూసీ భయపడాల్సిన అవసరం లేదు. పదవిలోవున్న వారి దగ్గర లంచం తినడమంటే రిస్కుతో కూడినపని; ఇది వికటించి ఉద్యోగానికే ఐరకాటకం కావచ్చు. ఎంక్వైరీలు రావచ్చు. సస్పెన్షన్లు జరగవచ్చు; ఆ న్యూసెన్స్ నంతటినీ తప్పించు కోవడానికి చేతి చిలుము వాలానే వదులుతుంది. అందువల్లే, అధికార అవినీతి సూత్రాలు క్షుణ్ణంగా చదివిన వారు కావడంవల్లే, ఆ అధికారోత్తముల వారు అన్ని ప్రశ్నలేసి మరీ, రిస్క్ అలవెన్స్‌గా రెండు వందలు దండుకున్నారు. ఇందుకు వారి త ప్పేమీలే ద ు.

## పినాకినీ తీరం

2 పేజీ కొరవ

నిలబడి వుంటుంది. రాజీవ్ గాంధీ మరణానంతరం రెండు జయంతులు, ఒక వర్ధంతి గడిచి పోయాయి; విజయకుమార్ రెడ్డి గారి రాజీవుడు ఎందువల్లనో శిలారూపంలో ఇంకా నిలబడ లేదు.!

వీటిలో గాంధీజీని మాత్రం రాజకీయ పార్టీల వారు మరచి పోలేదు; పార్టీ రహితంగా అందరికీ ఆయన పేరు అవసరం కాబట్టి, ఏటా అందరూ ఒక పూలదండ వేస్తుంటారు. అంతే కాదు ప్రాయోపవేశ ఆయుధం గాంధీజీ సొంతం. ఆయన దేశ స్వాతంత్ర్యానికి, ప్రజాశ్రేయస్సుకు దానిని చాలా పరిమితంగా వుపయోగించాడు. ఇప్పుడు చీటికి మాటికి, చిల్లరమల్లర కోర్కెలకు కూడా నిరాహార దీక్ష; అమరణంకాదు – చావకుండా, నీరస పడకుండా కొత్త మార్గం ఒకటి కనిపెట్టారు – రిలే నిరాహార దీక్ష అట ! చిత్తశుద్ధిలేని ఈ నిరాహార దీక్షలకు నెల్లూరు గాంధీ విగ్రహ ప్రదేశం కేంద్రమై పోయింది. పూర్వం తిప్పరాజు వారి సత్రం ప్రదేశాన్ని లాటీ చౌక్ అని, పొగతోట ప్రాంతాన్ని గాంధీ చౌక్ అని అనే వారు. ఇప్పుడు ఆ పేర్లు మాని పొయ్యాయి. ప్రస్తుతం కొత్తగా ట్రంకురోడ్డు గాంధీ విగ్రహ కేంద్రానికి నిరాహారదీక్ష చౌక్ అని నామకరణం చేసుకోవచ్చు!

బోస్ విగ్రహం ముఖం చూచే వాడే లేడు; దాని ప్రతిష్టాపనకు విశేషంగా కృషి చేసిన గండికోట వెంకటేశ్వర్లు కూడా గతించాడు. పొట్టి శ్రీరాములు విగ్రహాలు రెండు వున్నాయి – ఒకటి ఆత్మకూరు బస్ స్టాండు కూడలిలో; రెండవది మూలపేట సెంటరులో. రెండూ బస్ట్ విగ్రహాలే. అందులో బస్ స్టాండు వద్ద వున్న తల పెద్దది; వైశ్యులు కాబట్టి పెద్దదిగానే పెట్టుకున్నారు; మూలపేటది మరీ చిన్నతల. పిక్కల వరకు ఒంటి పొర అడ్డపంచ, దేహం కప్పుకోవడానికి ఒక తుండు గుడ్డ, హరిజన దేవాలయ ప్రవేశాన్ని, అస్పృశ్యతానివారణను కోరుతూ చేతిలో ఒకటి, వీపుకు మరొకటి నినాదాలు గల అట్టలు కట్టుకున్న ఆ త్యాగ మూర్తి పేరును జిల్లాకు పెట్టవలసిందిగా వుచిత సలహాలిచ్చే పెద్దలివ్వరూ, తలకాకుండా ఆయన నిండుమూర్తిని స్మరింపజేసే పెద్ద విగ్రహాన్ని ఎందుకు తలపెట్టలేదో ఆశ్చర్యం! అమర జీవి విగ్రహాలను మాత్రం ఏటా రెండు సార్లు మాలాలంకృతం చేస్తున్నారు.

ఏ.సి. సుబ్బారెడ్డి విగ్రహానికి పంపూజనోత్సవం పేరుతో ఆయన కుటుంబీకులే భారీ ఎత్తున నివాళులర్పిస్తున్నారు. ఆయన మీద పౌరులకు భక్తి గౌరవాలు పోలేదు.

మద్రాసు బస్ స్టాండు వద్ద వున్న ప్రకాశం విగ్రహం వైపు కన్నెత్తి చూచే వారు కూడా లేరు; ఆవిష్కరణ సమయంలో తప్ప, పూలమాల వేసిన నాధుడులేడు. దేశం కోసం సర్వం ధారబోసుకున్న వాడుగా ప్రకాశం పంతులును పేర్కొంటాము; బ్రిటిష్ వారి తుపాకి గుండుకు తన గుండెనిచ్చిన స్వాతంత్ర్య వీరుడని గర్వంగా పొగడుకుంటాము; గ్రామ పంచాయితీ వ్యవస్థ ఆది పురుషుడని ఘనంగా పొగడుకుంటాం; నాయుడు పేటలో చిన్నతనంలో చదువు కున్నాడని, వెంకటగిరి జమీందారీ వుద్యోగిగా ప్రకాశం గారి తండ్రి మల్లాంలో చనిపోగా ఆయన సమాధి ఈనాటికీ వుందని, మద్రాసు ముఖ్యమంత్రిగా ఆంధ్రకేసరి అక్కడికి పోయి, తండ్రి గారి సమాధి మీద పూల మాల వేసి భక్త్యంజలి ఘటించాడని నెల్లూరుతో ఆయన కున్న అనుబంధాన్ని గూర్చి ఆత్మీయంగా చెప్పుకుంటాము. కాని నెల్లూరులోని ఆయన విగ్రహానికి మొన్న జయంతి నాడు కూడా రాష్ట్రంలోని అన్ని చోట్లా ప్రత్యేకంగా సంస్మరింపబడగా, నెల్లూరులో ఒక పూలమాల కూడా వేయబడలేదు! ఈ సంవత్సరం ఆయన జయంతిని గ్రామ స్వరాజ్య దినోత్సవంగా రాష్ట్ర ప్రభుత్వం పరిగణించింది. ప్రభుత్వ కార్యక్రమంగానైనా కలెక్టరుగారు ఒక పూలమాల వేయించి వుండవలసింది.

వి.ఆర్. కాలేజి వద్ద వున్న డాక్టర్ అంబేత్కర్ విగ్రహానికి ఇటువంటి లోటేమీ లేవు. ఆయన వీరివలె అనాధుడు కాదు. మొన్న కూడా ఆయన జయంతి నాడు విగ్రహం ఆకర్షణీయంగా అలంకరింప బడి పూజలందుకొన్నది.

మద్రాసు బస్ స్టాండు వద్ద నెహ్రూ విగ్రహాన్ని రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ గత ఆగస్టులో ఆవిష్కరించారు. తర్వాత ఒక జయంతి, ఒక వర్ధంతి గడచిపోయాయి. కాని ఒక్కసారైనా ఆ విగ్రహం మాలాలంకృతం కాలేదు!

నెల్లూరులోని విగ్రహాల స్థితి గతులివి. వున్నవాటి దుస్థితే ఇట్లా వుంటే, గోపాలరెడ్డి గారన్నట్లు, లేని విగ్రహాలు ప్రతిష్టించడం ఎందుకు?

## జనవాణి

3 పేజీ కొరవ

మార్చమనే గొంతెమ్మ కోర్కె కోరడం మానాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

–ఎ.వి. శేషగిరిరావు

విజయవాడ.

### ఎమ్మెల్యేల ఓట్లు కూడా చెల్లలేదా?

ఉప రాష్ట్రపతి పదవికి జరిగిన ఎన్నికల్లో 10మంది ఎమ్మెల్యేల ఓట్లు చెల్లక పోవడం దురదృష్టకరం. పోటీలో కేవలం ఇద్దరే అభ్యర్థులు ఉన్నప్పటికి సక్రమంగా ఓటు వేయలేని ఎమ్మెల్యేలను ఎన్నుకోవడం ప్రజలు చేసిన పాపమే. నిరక్షరాస్యతా నిర్మూలనకు కోట్లరూపాయలు ఖర్చుపెడుతున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ముందుగా ఎమ్మెల్యేలను విద్యావంతులను చేయడం మంచిది.

–జె. పోలిరెడ్డి

నెల్లూరు.

### నిషేధించడం హర్షనీయం

నెల్లూరు జిల్లాలో డైలీ లాటరీలు నిషేధిస్తున్నట్లు జిల్లా కలెక్టర్ శ్రీ కె.రాజా ప్రకటన చేయడం హర్షణీయం. డైలీ లాటరీల వల్ల జరిగే అనర్థాలను పత్రికలు,విద్యార్థి సంఘాలు, రాజకీయ పక్షాలు సంయుక్తంగా తెలియ చేస్తూ పోరాడిన వైనం ప్రశంసనీయం. కలెక్టర్ గారు ఇప్పుడు ధైర్యంతో సంధించిన నిషేధాస్త్రం మరి కొంచెం ముందుగా వచ్చివుంటే కొన్ని వేల కుటుంబాలు బాగుపడి వుండేవి

–ఎస్.వి.ఎస్.కోటేశ్వరావు

నెల్లూరు.

### సన్మానం పేరిట అవమానం?

స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు కస్తూర్బా కళాక్షేత్రంలో కళాకారులకు సన్మాన కార్యక్రమం పేరిట అవమాన కార్యక్రమం జరిగింది. నిర్వాహకులైన ప్రజా పౌర సంబంధ శాఖాధికారి రాజకీయ నాయకుల మెప్పు కోసమా అన్నట్లు మొక్కుబడి కార్యక్రమాన్ని నిర్వహించారు. సన్మాన కర్తల గూర్చి పరిచయ వాక్యాలు కరువయ్యాయి. ప్రకటించినట్లు గాక సాంస్కృతిక కార్యక్రమాలు అయిన తరువాత సన్మాన కార్యక్రమం మొదలు పెట్టడం వల్ల ప్రేక్షకులే లేకుండా పోయారు. సన్మాన గ్రహీతలకు కృతజ్ఞతలు చెప్పుకొనే అవకాశాన్ని కూడా ఇవ్వలేదు. స్వాగతం నుంచి వందన సమర్పణ వరకు అన్నీ తానైనట్లు ప్రవర్తిస్తున్న పౌరసంబధ అధికారి రాష్ట్రంలో ఇతర చోట్ల కళాకారులకు జరిగే సన్మాన కార్యక్రమాలు చూసి నేర్చుకొంటే బాగుంటుందని మా అభిప్రాయం.

-ఎం.జనార్ధన్-హరికృష్ణ

విజయవాడ.

## పంచాంగము

వినాయక చతుర్థి

తేది 31 సోమవారము వినాయక చతుర్థి

పుబ్బకార్తె ప్రారంభము

**ఆగస్టు తిథులు**

**భాద్రపద శుద్ధ**

| | |
|---|---|
| తే 29 శని పాడ్యమి ఉ.గ. | 5.55వ |
| తరువాత పూర్తిగ విదియ | |
| తే 30 ఆది తదియ రా.గ. | 3.30వ |
| తే 31 సోమ చతుర్థి రా.గ. | 1.20వ |

**సెప్టెంబరు తిథులు**

| | |
|---|---|
| తే 1 మంగళ పంచమిరా.గ. | 12.05వ |
| తే 2 బుధ షష్ఠి రా.గ. | 10.56వ |
| తే 3 గురు సప్తమి రా.గ. | 10.15వ |
| తే 4 శుక్ర అష్టమి రా.గ. | 10.00వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

ఎం.ఏ

## సినిమా పేజీ

# విజయశాంతి సుమన్‌ల పెళ్ళి పెరుమాళ్ళకెరుక!

"ఘరానా మొగుడు" చిత్రానికి మాతృక అయిన శివాజీ ప్రొడక్షన్స్ "మన్నన్" తమిళ చిత్రం విజయోత్సవం ఇటీవల మద్రాసులో జరిగింది వేదికమీద. ఆ చిత్ర కథానాయిక విజయశాంతి పేరు చెప్పి, రెండుసార్లు ఆమెను "శ్రీమతి" అన్నారు. అప్పుడు విజయశాంతి ముఖం అదోలా అయిపోయింది. ఆ తర్వాత ఆమె ప్రభును దగ్గరికి పిలిచి , చెవిలో ఏదో గొణిగింది. ప్రభు వెంటనే వేదిక దిగి, పాత్రికేయులు కూర్చున్న రెండో వరుస దగ్గరికి వెళ్ళి " శ్రీమతి విజయశాంతి " అని వ్రాయకండి కుమారి విజయశాంతి అని పేర్కొనండి ప్లీజ్!" అంటూ దాదాపు వేడుకున్నాడు.

ఆగస్టు మొదటి వారంలో వెలువడిన నాలుగైదు తమిళ పత్రికలు విజయశాంతి త్వరలో సుమన్‌ను పెళ్ళాడబోతున్నట్లు తెలియజేశాయి. ఈ పొగ ఎలా వచ్చిందో ఎవరికీ తెలీదు. కాని. సుమన్ మాత్రం పెళ్లి ప్రసక్తివచ్చినప్పుడల్లా ఈ ఏడాదిలోనే తెలుగు వనితనే చేసుకుంటానంటున్నారు. లోగుట్టు పెరుమాళ్లకెరుక!

### ఎస్.పి.ప్రచురణ

1931లో ప్రారంభమైన తెలుగు సినిమా గీతాలు 1991నాటికి క్రమేణా ఎటువంటి పరిణామాలకు లోనైంది, ఏ ఏ ప్రభావాలవల్ల ఆ మార్పులు సంభవించాయి వగైరా వివరాలతో పాటు 60ఏళ్ల తెలుగు సినిమాల లిస్టులు, గీతరచయితల జాబితా ఉన్న పుస్తకాన్ని డాక్టరేట్ పొందిన పైడిపాల రచించారు. దీనిని ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం 'స్నేహ ప్రచురణలు' పేర ప్రచురించదానికి పూనుకున్నారు.



అయ్యయ్యో బ్రహ్మయ్యలో నరేష్

# అయ్యో పాపంశ్రీనివాస్!

విఖ్యాత రచయిత, నటుడు గొల్లపూడి మారుతీరావు తృతీయ పుత్రుడు గొల్లపూడి శ్రీనివాస్ ఆగస్టు 12 తేది తమ స్వస్థలం విశాఖపట్నం వద్ద సముద్రంలోపడి దుర్మరణం చెందడం తెలుగు చిత్ర రంగాన్ని విచార సాగరంలో ముంచెత్తింది. ఆ అబ్బాయి గొప్ప దర్శకుడవుతాడన్న విశ్వాసంతో అతడికి కె. రాఘవేంద్రరావు. ఎ.కోదండరామిరెడ్డి ప్రభృతుల వద్ద మారుతీరావు శిక్షణ ఇప్పించారు. ఆ యువకుని ప్రతిభను గుర్తించి "పెళ్ళిపుస్తకం" అనే చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశాన్ని కల్గించారు. చక్కని స్క్రిప్టును మారుతీరావే తయారు చేశారు. ఆగస్టు 3న విశాఖపట్టణంలో షూటింగ్ ప్రారంభమైంది. ఎంతో అనుభవంగల దర్శకుడిలా శ్రమిస్తున్నాడని శ్రీకర్ ప్రొడక్షన్స్ యూనిట్‌లోని వారందరూ భావించారు. ఆగస్టు 12న ఒక సన్నివేశ చిత్రీకరణకు సాగర్ దుర్గగుడి వద్ద ఉన్న మట్టి గుహల్లో శ్రీనివాస్ సిద్ధమవుతుండగా ఉధృతంగా లేచివచ్చిన ఒకకెరటం ఆ యువకుడ్ని పొట్టన బెట్టుకుంది. వెంటనే అక్కడున్న జాలర్లు హుటాహుటిన

కొరవ 10 పేజిలో

# డబ్బింగ్ చిత్రాలు డబ్బాలలో పడి మూల్గుతున్నాయి!

తెలుగు డబ్బింగ్ చిత్రాల సమాఖ్యవారు తమ సమస్యల గురించి ఇటీవల ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డికి ఒక వినతి పత్రాన్ని సమర్పించారు. రాష్ట్రేతరంగా తయారయ్యే చిత్రాలకు విధించే అదనపు పన్ను మూలంగా కుటీర పరిశ్రమగా రెండు వందలకు పైగా డబ్బింగ్ చిత్రాలు విడుదలవకుండా దీనంగా మూల్గుతూ మూల పడున్నాయి. సుమారు ఎనిమిది కోట్ల రూపాయల మూలధనం ఈ చిత్రాల మూలంగా స్థంభించిపోవడంవల్ల డబ్బింగ్‌పై బ్రతికేవారి స్థితి మరింత ఆందోళనకరంగా ఉంది. డబ్బింగ్ కళాకారులు పని లేక పస్తులు పడే ప్రమాదమూ ఏర్పడింది. అంచేత, రాష్ట్రంలో నిర్మితమయ్యే చిన్న బడ్జెట్ చిత్రాలకు విధించేలా 8శాతం పన్నునే డబ్బింగ్ చిత్రాలకూ వర్తించేలా చూడమని ఆ వినతి పత్రంలో కోరారు. ప్రైవేట్ చిత్రాల నిర్మాతలు ఏమంటారో మరి!

### స్టీల్ పరిశ్రమ నుండి సినిమా రంగానికి

పేమెస్ స్టీల్ ఇండస్ట్రీస్ జాయింట్ మేనేజింగ్ డైరెక్టర్ జి. హరిబాబు చిత్ర నిర్మాణ రంగంలో అడుగు పెట్టారు. ఆ రంగం కన్నా ఈ సినిమా రంగంలో ఎక్కువ డబ్బు సంపాదించ ఆశ అయినా ఉండాలి. లేక, ఈ గ్లామర్ ఫీల్డ్‌కు ఆకర్షింపబడైనా ఉండాలి. ఈయన చిత్రంలో కృష్ణ, నిరోషా, రాజ్‌కుమార్, ఆమని, సుధాకర్, శ్రీకాంత్, గిరిబాబు, కోట శ్రీనివాసరావు, బాబూ మోహన్, సాయికుమార్, మహర్షి రాఘవ, వై.విజయ, అన్నపూర్ణ, చంద్రిక, వెన్నెల పాత్రధారులు. కథ, మాటలు: ఆకెళ్ళ. సంగీతం: విద్యాసాగర్. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: తమ్మారెడ్డి భరద్వాజ.

# అరువు తెచ్చుకోను తెలుగు తారలు కరువైనారా?

సావిత్రి, కన్నాంబ, నాగయ్యవంటి మన ప్రముఖ తారలను ఆనాడు ఎక్కువగా ఆదరించినది ఇతర భాషా చిత్రనిర్మాతలే. రేఖ, వహీదారెహమన్ వంటి వారు ఆదిలో తెలుగు నిర్మాతల ఆదరణ అంతగా లభించక పోవడం వల్లే హిందీ చిత్ర సీమకు వెళ్లారు. అప్పుడు జయప్రద పరిస్థితీ అంతే. అర్చన, జయంతి, భానుప్రియ, గౌతమివంటి వారిని ఈనాడు చాలా మంది తెలుగు నిర్మాతలు మరచి పోయినా వాళ్ళనటనా ప్రాభవం వల్ల తమిళ, కన్నడ, మలయాళ రంగాలలో రాణిస్తున్నారు. వాళ్ళకిచ్చే పారితోషికం కన్నా ఎక్కువ చెల్లించి హిందీ తారలు నగ్మా, దివ్యభారతి వంటి వారిని మనవాళ్ళు దిగుమతి చేసుకుంటున్నారు. కథల్లో వెరైటీ లేనందువల్ల హీరోయిన్‌లలో నైనా వెరైటీ చూపించడం మన దర్శక

కొరవ 10 పేజిలో

# బంగారు మామ

# స్వప్నంలోలీలగా కదలాడే భావచిత్రం మాదిరుంది!

చిత్రసమీక్ష

గ్రద్దలూరు గోపాలరావు

ఆ మామ బంగారంవంటి వాడు. మార్గమధ్యంలో విషాదాన్ని, చవిచూచినా చివరన జీవితాన్ని బంగారు పంటగా మార్చుకున్నాడు.

ఇక ఆ మేనకోడలూ బంగారు బొమ్మవంటిదే. ఆమె బ్రతుకు మార్గాన్ని బంగారు బాటగా తీర్చిదిద్దుకోవాలనుకుంది. కాని ఆమె బంగారు కలల కాపురం అర్ధంతరంగా అంతమైంది.

ఆ మామ, మేనకోడళ్ళ వివాహ బంధమే "బంగారుమామ" చిత్రం తాలూకు కథ. మేనకోడలు తన దాంపత్య జీవితాన్నిగూర్చి లోలోన గంభీరంగా ఆలోచించింది. బంగారుమామతో బ్రతుకును రాగరంజితం చేసుకోవాలనుకుంది. అమాయకురాలైన ఆమె, భార్యగా కొత్తరూపం దాల్చి, జీవితాన్ని సార్థకం చేసుకోవాలనుకుంది. కాని ఆమె విధివంచిత అయింది. ఆ కారణంగా ఆమె జీవితం ఒక దారుణమైన కథగా మిగిలిపోయింది.

ఆ మేన కోడలు వివాహ బంధాన్ని విషాద తీరానికి చేర వేసిందా కథ! రసవత్తరంగా సాగవలసిన ఆమె రాగ బంధాన్నికన్నీటి ముగింపుగా మార్చిందా కథ! బండెడు దుఃఖాన్ని లేత గుండెలో దిగ మింగుకున్న బండ బ్రతుకుగా దిగజార్చిందా కథ! ఆమె సంగతే కాదు, మామ కథ కూడా అంతే. ఎటుచూచినా కుప్పతెప్పలుగా పడివున్న విషమ సమస్యలు. తనచుట్టూ వున్న గడ్డు పరిస్థితులు;రోజూ, ప్రతిరోజూ క్షీణిస్తున్న అనుబంధాలు, విచ్ఛిన్నమవుతున్న భార్యాభర్తల సంబంధాలు, వీటి ప్రభావం వల్ల దారుణమైన గుండెకోతతో అతని జీవితంలో చాలా భాగం ఎడారైపోరే కన్నీరే కనిపిస్తుంది.

అందువల్లనే మామ, మేనకోడళ్ళ విషాదభరితమైన కథతో కూడుకున్న ఈ చిత్రం కథ పట్టుగా వుంది ప్రేక్షకులను ఆకట్టుకుంటుంది. ముత్యాల సుబ్బయ్య, టి. మధూలు కథను పల్లెటూరి వాతావరణంలో ఒక కుటుంబ కథగా చక్కగా మలిచారు. కథను మంచి మలుపులు త్రిప్పారు. చిత్రం రక్తికట్టింది. చిత్రానికి ఆయువుపట్టయిన మామ, మేనకోడళ్ళను దర్శకుడు ముత్యాలసుబ్బయ్య సంఘటనల కూర్పుతో చక్కగా మలిచాడు. వారిద్దరి అంతరంగాలను తేట తెల్లం చేశాడు. చివరన మేనకోడలు మధురస్వప్నం చెదరిపోయి చనిపోయినట్టు చూపిన దృశ్యం ఆమెమీద అనంతమైన సానుభూతిని కల్గిస్తుంది.

కొరవ 10 పేజిలో

**జమీన్‌రైతు**

సంవత్సర చందా రూ. 100.00
ఆరు నెలలకు రూ. 50.00
విడి ప్రతి రూ. 2.00




### కావలి డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

O.P. 11/92

పామంజి మంగమ్మ —పిటీషనరు

Vs

రెస్పాండెంటు Nil

పై నెంబరు కేసులో పిటీషనరు భర్త చనిపోయినంతలో వారసత్వ సర్టిఫికెటుకు పిటీషను పెట్టినంతలో ఆక్షేపణలున్న చో 7.9.92 తేదిన పగలు 10.30 గంటలకు పై కోర్టులో తెలుపుకొనవలెను.

**జి. దశరథరామయ్య**

అడ్వొకేటు, కావలి

### హై కోర్టు ఆంధ్రప్రదేశ్

హైదరాబాదు

C.M.P. 9656/84

C.M.A 758/84

ప్రతివాడ రాజేశ్వరి —పిటీషనరు వారి
మరియు ఇతరులు
మరియు
యమ్. రత్నాకర చౌదరి
మరియు ఇతరులు —ప్రతివాదులు

To,

కె. సుధాకర రావు
S/o. వెంకట సుబ్బారావు
డోర్ నం. 12.205, బృందావనము,
నెల్లూరు. - 4ప్రతివాది

వారి పై నంబరు దావాలో మిమ్ములను 4 వ ప్రతివాదిగా చేర్చినారు. కనుక మీరు నోటీసు తీసుకొనవలయును. కనుక మీరు పై దావాలో ఈ పట్టీకేసను చేసిన నెల రోజులలో హై కోర్టు నందు మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనని యెడల కేసు పరోక్షమున తీర్మానించబడును.

**పి. గోపాలదాసు**

వారి తరపు న్యాయవాది
Plot B.7 "Orchides" - G4,
Dugabai Deshmukh Colony,
Vidyanagar, HYDERABAD - 7.
Tel: 86 54 55 & 61 27 44

## పెండ్లిండ్లు

(11 పేజీ కొరవ)

ఝాన్సీలక్ష్మి బి.ఎ. కావలి- స్వర్గీయ సదీదేవ్ సింగ్ కుమారుడు మహేంద్ర సింగ్ బి.టెక్. వివాహం 15తేది నెల్లూరు విజయ మహల్‌లో జరిగింది.

* * *

నెల్లూరు వస్త్ర వ్యాపార రంగంలో ప్రథమశ్రేణిలో వున్న విమల్‌వారి అడపడుచు డాక్టర్ జయలక్ష్మి ఎం.బి.బి.యస్.; బళ్లారి రోటేరియన్ శ్రీ కె.రామాంజనేయులు కుమారుడు డాక్టర్ నరేష్ కుమార్ ఎం.బి.బి.యస్., డి.డి.ఎం.ఎస్. వివాహం 25తేది -ఏలాకుల తోటలోని పత్రివారి సత్రంలో జరిగింది.

అంతర్ రాష్ట్ర వివాహం కావడం, ఇటీవలి దశాబ్దాలలో వినబడని ప్రసిద్ధమైన పత్రివారి సత్రంలో జరగడం ఈ పెండ్లి హెచ్చిపాలు.

* * *

మాజీ మంత్రి, జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, ఖాదీ వస్త్ర ధారణా వ్రతాన్ని నిరాఘాటంగా సాగిస్తున్న కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి అనంగు దౌహిత్రి. శ్రీ బి. పట్టాభిరామరెడ్డి కుమార్తె భ్రమర; తూర్పుగోదావరి జిల్లా రైస్ మిల్లర్ల అసోసియేషన్ అధ్యక్షుడు, కాకినాడ - దేవి, శ్రీదేవి జంట థియేటర్ల అధిపతి శ్రీ డి. భాస్కర రెడ్డి కుమారుడు వీరభద్రారెడ్డి బి.కాం., వివాహం 16 తేది రాత్రి వి.ఆర్. హై స్కూలులో జరిగింది.

ఇటీవల కాలంలో ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డి హెలికాప్టరును వదలి అర్ధరాత్రి పూట వాకాడుకు ప్రయాణించిన ఏకైక సందర్భం ఇది. ఆనం సంజీవ రెడ్డి మనుమరాలు పెళ్లికి హాజరైనాడాయన. సామంతు గోపాలరెడ్డి కుమారుని పెళ్లిని 15 తేది శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ తిలకిస్తే, 16 తేది రాత్రి జనార్ధన రెడ్డి గోపాలరెడ్డి ఇంటికి పోయి పలుకరించి వచ్చారు.

* * *

విద్యుత్ శాఖ వుద్యోగి, మైకు - తబలా వగైరా వ్యాపకాలు గల మృదు స్వభావి శ్రీ సి.వి. సేతురామయ్య పుత్రిక జయలక్ష్మి; విశాఖ పట్టణం - స్వర్గీయ నమ్మిప్రభాకర రావు పుత్రుడు చంద్రశేఖర్ పెండ్లి 19 తేది నెల్లూరు టవున్ హాలులో జరిగింది.

* * *

పి.ఎం.సి. జిల్లా మేనేజరు, సత్యకాలం నాటి అధికారి, కారా కిల్లీ ఆనందంలో సదా సరదాగా వుండిన 'సుందరమహల్' సుందర రామిరెడ్డి కుమారుడు - శ్రీ గర్తం వేణుగోపాలరెడ్డి కుమార్తె సునీత బి.ఎస్.సి.,; బెంగుళూరు -అసిస్టెంటు ఫారెస్టు కన్సర్వేటర్‌గా రిటైరైన శ్రీ డి.ఎస్. లక్ష్మణ రెడ్డి కుమారుడు జయచంద్రారెడ్డి ఎం.ఎస్. (అమెరికా) పరిణయం 23 తేది నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగింది.

మంచి మనసుకు మంచి కలుగుతుం దంటారు. వేణుగోపాలరెడ్డికి మంచి అల్లుళ్లు లభ్యమైనారు - అదృష్ట వంతుడు!

### జూన్, జూలై

ఇందుపూరు వాసి శ్రీ బస్వారెడ్డి గోపాలరెడ్డి తనయ డాక్టర్ వాణి ఎం.డి.; కాళహస్తి మండలం తొండమనాడు - శ్రీ దందోలు బత్తిరెడ్డి తనయుడు డాక్టర్ భక్తవత్సల రెడ్డి ఎం.ఎస్. ఎం.సి.ఎచ్ వివాహం జూన్ 24 తేది తిరుచానూరు శ్రీనివాస కల్యాణ మండపంలో జరిగింది.

* * *

జిల్లా కోఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి మాజీ అధ్యక్షుడు, పొగాకు బోర్డు మాజీ సభ్యుడు, తెలుగుదేశీయుడు, కమ్మవారి పాళెం వాసి శ్రీ చెకూరు బాబూరావు కుమార్తె డాక్టర్ సునీత ఎం.బి.బి.ఎస్.; వాసిలి - శ్రీ కరణం ఆదిశేషయ్య నాయుడు కుమారుడు, డాక్టర్ పద్మనాయుడు ఎం.బి.బి.ఎస్., పరిణయం జూలై 31 తేది నెల్లూరు టి.టి.డి. లో జరిగింది.

* * *

కొత్తకోడూరు - శ్రీ వేణుంబాక విజయకుమార్‌రెడ్డి కుమార్తె కౌసల్య బి.ఎస్.సి; సూళ్లూరుపేట - శ్రీ దిరిశాల వెంచురామరెడ్డి కుమారుడు, ఒంగోలు కాలేజి లెక్చరరు సుబ్బారెడ్డి ఎం.కాం., వివాహం జూలై 31 తేది నెల్లూరు టవున్ హాలులో జరిగింది.

* * *

వుత్సాహవంతుడైన చెరుకు రైతు సంఘం నాయకుడు, పల్లెకొంపను వదలి నెల్లూరు నగరవాసం పట్టిన శ్రీ పెళ్ళకూరు పెంచలు రెడ్డి కుమార్తె క్రాంతి; రామాపురం - శ్రీ కె.వి. సుబ్బారెడ్డి కుమారుడు రాజశేఖర రెడ్డి కళ్యాణం జూలై 31 తేది నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగింది.

శుభం!

## రైతులోకం

4 పేజీ కొరవ

చాలా ముఖ్యమైనది . కోడి కాలు పెట్టిన చోట కోటి వర్షాలు మట్టి వుంటుందనే సామెత మనంవింటూంటాము. రైతుతమకున్న అనుభవంతో తమకున్న పొలం నుంచి ఆ నేల విస్తీర్ణానికి తగినట్లుగా మట్టినమూనాలు తీయాలి.

1. నేల రంగు, పైకి కనిపించే భౌతిక తేడాలు, వాలు, డ్రైనేజీ, నేలరకాలను బట్టి విడి విడిగా మట్టి నమూనాలు తీయాలి. 2. పొలంలో అక్కడక్కడ వున్న చవిటి నేలను వదిలి మట్టి నమూనాలు తీయాలి. 3.ఎరువు కుప్పలు, రసాయనిక ఎరువులు పెట్టిన స్థలంలో మట్టినమూనాలు తీయరాదు. 4.రసాయనిక ఎరువులను చాళ్ళలో వాడితే, ఆ చాళ్ళలో నమూనాలు తీయకుండా అవసరమైతే చాళ్ళ మధ్యలో తీయాలి. 5. సాధారణంగా పొలాన్ని ఒకటి రెండు సార్లు దున్నిన తరువాత రసాయినిక మరియు సేంద్రియ ఎరువులు వేయక ముందు మట్టి నమూనాలు తీయాలి. 6. పొలం యొక్క భౌతిక స్వభావాన్ని బట్టి 5 నుండి 20 ఎకరాలకు ఒక నమూనా తీయాలి. మట్టిని తీయటానికి ఒకే రకమైన పొలాన్ని మొదట ఎన్నుకోవాలి. ఆ తర్వాత ఆ పొలం నుండి 10 నుండి 15 చోట్ల కావలసిన లోతు వరకు మట్టిని తీసి అంతా కలపాలి. ఆ మట్టిని నాలుగు భాగాలుచేసి అందులో రెండు భాగాలను తీసి వేయాలి. ఈ విధంగా అరకిలో మట్టి అయినంతవరకు చేయాలి. దీనినే 'క్వార్టరింగు' పద్ధతి అంటారు. మట్టిని ఒక శుభ్రమైన గుడ్డ సంచిలో వేయాలి. మట్టి నమూనా వివరాలను ఒక కాగితం మీద వ్రాసి సంచిలో వేయాలి. 7. వరి, జొన్న, సజ్జ, వేరుశనగ, చెరుకు మొదలయిన వాటికి 15నుండి 30సెంటిమీటర్లు లోతువరకు నమూనాలు తీయాలి. ఉద్యానవన పంటలైన నిమ్మ, నారింజ, మామిడి, సపోట, జీడిమామిడి మొదలగు వాటికి 1 మీటరు నుంచి 1 1/2మీటరు వరకు గుంటలు త్రవ్వి, ప్రతి 25సెంటిమీటరుకు ఒక నమూనా ఎప్పున 1 1/2 మీటరు కు తీయాలి. ఈ పంటలకు నేల భౌతిక మరియు రసాయనిక స్వభావాన్ని తెలుసు కోవడం చాలా అవసరం. 8. ఉప్పు నేలలు లేక చవిటి నేలలకు విడిగా నమూనాలు తీయాలి.

సమర్ధవంతంగా పోషక ధాతువులను నేలనుండి, రసాయనిక ఎరువులనుండి మొక్కకు అందించి రసాయనిక ఎరువుల మీద ఖర్చు తగ్గించాలంటే రైతుకు భూసార పరీక్ష తప్పనిసరి.

## చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

చిత్రంలో "బంగారు మామ" పేరు రాముడు (వినోద్‌కుమార్). రాముడు చిన్నవాడుగా ఉండగా అక్కచనిపోతూ తన కూతురు కస్తూరిని (మీనా)అతనికి అప్పగిస్తుంది. పసివాడుగా వున్న రాముడిని పెంచవలసిన అక్క చనిపోయి, అక్కకూతుర్ని రాముడు పెంచవలసిరావటం కథలో ఒక మలుపు. ఈ మలుపే చిత్రానికి ఆధారం. రాముడి చేతిలో పెరిగిన పిల్లను, పెంచిన ప్రేమతో కూతురులా చూమకోవాల్నా, లేక వరసకు మేనకోడలైనందున రాముడు పెళ్లిచేసుకోవాల్నా? పెంచిన మామే మేనకోడల్ని చేసుకోవాలని సమాజం చెప్పేతీర్పు. రాముడే కస్తూరిని పెళ్లిచేసుకుంటాడని అందరూ అనుకుంటారు. కాని ఇక్కడ కథ మరోమలుపు తిరగటంతో, రాముడు కస్తూరికి వేరే సంబంధం కుదురుస్తాడు. కాని మామ, మేనకోడలిని పెళ్లిచేసుకోవటం అవసరం అనే ఆనవాయితీని నిలబెట్టేందుకు ఇక్కడ కథ ఇంకో మలుపు తిరుగుతుంది. కస్తూరికి కుదిర్చిన సంబంధం తాలూకు పెళ్లికొడుకు పెళ్లికి కొన్నిరోజులు ముందు ఒక ప్రమాదంలో చనిపోతాడు. కస్తూరిని పెళ్లిచేసుకోదలచిన పెళ్లికొడుకు చనిపోవటంతో ఆమెను పెళ్లిచేసుకునేందుకు మరెవ్వరూ ముందుకు రారు. ఆవూరి ప్రెసిడెంటు భూషయ్య (సత్యనారాయణ) బలవంతంతో, రాముడు తాను ప్రేమించిన టీచరమ్మను(యమున) వదులుకొని కస్తూరిని పెళ్లాడుతాడు.

కస్తూరి అమాయకురాలు. భార్యగా ఎలా మసలుకోవాలో తెలియని పసితనం. అందువల్ల టీచరమ్మ, కస్తూరిని అన్నికోణాల్లో భార్యగా తీర్చిదిద్దుతుంది. ఇది టీచరమ్మ త్యాగానికి నిదర్శనం. కస్తూరి సంసారజీవితంలో ప్రవేశించే ముందు కథ మరోమలుపు తిరుగుతుంది. ఆవూళ్లోని పైడిరాజు(సాయికుమార్) అనే దుర్మార్గుడు కస్తూరిని మానభంగం చేస్తాడు. దానితో తన మలిన శరీరాన్ని రాముడికి అర్పించటం ఇష్టంలేక, తన మానభంగం విషయం చెబితే రాముడు, పైడి రాజుతో ప్రతీకారానికి దిగటంతో, రాముడికి ఏదైనా ప్రమాదం జరుగుతుందేమో నన్న భయంతో, కస్తూరి ఎవరికీ చెప్పకుండా ఊరు విడిచి పోతుంది. తన కడుపులో పెరిగే బిడ్డకోసం కస్తూరి బ్రతుకుతుంది. కష్టాల ఈ బ్రతుకు మార్గంలో మరోగ్లిష్టమైన మలుపు తిరుగుతుంది కథ. బస్తీలో సారాకొట్టు నడుపుతున్న పైడిరాజు కంటబడుతుంది కస్తూరి. తనవలనుండి తప్పించుకున్న కస్తూరిని వెంటాడుతున్న పైడిరాజు, కస్తూరికోసం వెదుకుతున్న రాముడు, కస్తూరి సమక్షంలో ఎదురుపడతారు. ఇక ఇద్దరిమధ్యా ఫైటింగ్. నిండు చూలాలుగా వున్న కస్తూరి సందుచూసుకొని కక్షసాధింపుగా పైడిరాజును చంపుతుంది. అక్కడే బిడ్డను కని, రాముడు చేతుల్లో పెట్టి ప్రాణాలు వదిలి పెడ్తుంది. చిత్రంలో విషాద సన్నివేశాలు బాగా వేడెక్కినప్పుడు ప్రేక్షకుల భారం తగ్గించేందుకు దర్శకుడు వెంటనే హాస్య సన్నివేశాలను చూపుతూ ప్రేక్షకులను ఆనందపరుస్తూ వచ్చారు. అలాగే చిత్రం చివరన కూడా కస్తూరి చావుతో చిత్రాన్ని విషాదంగా ముగించకుండా, ఆనందంగా ముగించారు. టీచరమ్మను రాముడిని కలిపారు. పాత ప్రేమికులైన వారిద్దరూ కలిసినట్టు దర్శకుడు చాలా సున్నితంగా చూపారు.

ఇలా కథ, కథలోని మలుపులు అభినందనీయాలుగా వున్నాయి. టి.మధు మాటలు సమయస్ఫూర్తితో సన్నివేశాలకు సత్తువ కలిగించాయి. వేటూరి పాటల్లో సాహిత్యం, భావం చెట్టాపట్టాలతో సాగాయి. రాజ్‌కోటి సంగీతం మాధుర్యం పంచింది. "ఝుమ్మంటే తొలిప్రేమ" పాట చిత్రీకరణ ప్రత్యేకత సంతరించుకుంది; స్వప్నంలో లీలగా కదలాడే భావచిత్రంలా రూపొందిందీచిత్రం. శ్రీనివాసరెడ్డి ఫొటోగ్రఫీ ప్రతి దృశ్యాన్ని భావయుక్తంగా చూపింది.

వినోద్‌కుమార్ నటన ప్రశంసనీయం. బరువైన పాత్రకు తన నటనతో మరింత బలం కూర్చాడు. మీనా అందంగా, ఆకర్షణీయంగా వుంది. నటన ఫర్వాలేదు. టీచరమ్మగా యమున తన పాత్రకు నిండుదనం కూర్చింది.

## తెలుగు తారలు

9 పేజీ కొరవ

నిర్మాతల తాపత్రయంలా ఉంది. అమ్రీష్‌పురి వంటి విలన్‌ల కాల్‌షీట్లు కష్టపడి సంపాదించిన నిర్మాతలూ ఉన్నారు.

ఇపుడు ఇతర భాషల హీరోలకోసం కూడా ఎగబడటం మరింత బాధాకరంగా ఉంది. మన రాష్ట్రంలోని ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లలో చక్కని రూపురేఖలు గల ఎందరో కళాకారులు తర్ఫీదు పొందుతున్నారు. నాటకాలలో కూడా ఆరితేరిన యువకులెందరో ఉన్నారు. వీళ్ళందర్నీ కాదని ఏ తమిళ హీరోనో, కన్నడ హీరోనో తెలుగు చిత్ర రంగానికి పరిచయం చేయడానికి కొందరు నిర్మాతలు ప్రయత్నించడం శోచనీయం.

## శ్రీనివాస్

9 పేజీ కొరవ

సముద్రంలోకి దూకి, గాలించారు. చివరి చావు బతుకుల్లో ఉన్న అతడ్ని ఒడ్డుకు చేర్చి, కె.జి. హాస్పటల్‌కు తరలించే లోగానే అసువులు బాశాడు. శ్రీనివాస్‌కు గత సంవత్సరమే వివాహమైంది. ఒక బిడ్డతండ్రికూడా. అతని దర్శకత్వంలో తొలి చిత్రం తయారవకుండానే ఏ దుష్టశక్తి ఇంత అన్యాయం చేసింది. ఈ విషాద సాగరం నుంచి గొల్లపూడి మారుతీరావు దంపతులు తేరుకోవడానికి ఎంత కాలం పడుతుందో!

# పెండ్లిండ్లు

## ఆగస్టు

జిల్లా ఎన్.జి.ఓ. అసోసియేషన్ కార్యదర్శిగా, ఆ సంఘానికి దర్గామిట్టలో విశాలమైన స్థలాన్ని, కళ్యాణమండపంతో సహా చక్కని భవనాన్ని సమకూర్చడంలో అనుపమానంగా సేవ చేసిన వారిలో ఒకరైన వ్యవసాయ శాఖోద్యోగి శ్రీ పెనుబర్తి నాగభూషణరావు కుమార్తె ఉషారాణి; నెల్లూరు – కీ.శే. మాదిరాజా వెంకట సుబ్బయ్య కుమారుడు వెంకటేశ్వర్లు వివాహం 5 తేది శిఖరం వారి వీధి – ఆర్యవైశ్య కళ్యాణ నిలయంలో జరిగింది.

* * *

చైతన్యవంతులైన గుడ్లూరు వారి పాళెం రైతు శ్రీ ఈపూరు వెంకురెడ్డి పుత్రిక రాజ్యలక్ష్మి; పొన్నపాడ – శ్రీ ఓడూరు రామలింగారెడ్డి పుత్రుడు చంద్రశేఖర రెడ్డి పెండ్లి 2 తేది టి.వి.ఎస్. కళ్యాణ సదన్‌లో జరిగింది.

* * *

ఆడిటరుగా కంటే అశేష అధికార అనధికార మిత్రజన రంజకుడు, సనాతన ఆధునాతన సమ్మిళిత స్వభావుడు, భక్తిరక్తిప్రధానుడు, హైదరాబాదు – నెల్లూరు – మద్రాసుల మధ్య వాయుదూత్ సర్వీస్ పలి నిర్విరామంగా తిరిగే కార్యకుశలుడు, అల్లాడి కులోద్భవుడు శ్రీ అల్లాడి వాసుదేవన్ కుమారుడు; అంటె బహుశా నెల్లూరులో మొదటి ఎం.బి.బి.ఎస్. డాక్టరుగా అర్థశతాబ్దం క్రితం ప్రఖ్యాతి చెందిన శాంత సౌజన్యమూర్తి కీర్తి శేషుడు అల్లాడి అనంత నారాయణన్ మనుమడు; హైదరాబాదులో ఆడిటింగ్ వృత్తిలోనే బిజీగా వున్న యువకుడు విశ్వనాథ్; కడప – శ్రీ టి. కాళహస్తి కుమార్తె సుగంధి లక్ష్మి పరిణయం 5 తేది ఇందిరా భవన్‌లో బంధుమిత్ర అభిమాన జనసమ్మర్దంగా శాస్త్రీయంగా జరిగింది.

* * *

బొంబాయిలో భారత ఎస్.జి. అణువిద్యుత్ కార్పొరేషన్ ఇంజనీరు శ్రీ వి. దయాకర్ కుమార్తె; అంటె, స్వాతంత్ర్య సమరవీరుడు, గిరిజనోద్ధారకుడు కీ.శే. వెన్నెలకంటి రాఘవయ్య గారి మనుమరాలు అరుణ; డాక్టర్ ఎస్. రాధాకృష్ణ – డాక్టర్ సావిత్రి కుమారుడు, అమెరికాలో కంప్యూటర్ సిస్టం•ఇంజనీరుగా వున్న శ్రీనివాస్ రవి కుమార్ వివాహం 5 తేది రామసుబ్బయ్య వీధిలోని వధువు ఇంట జరిగింది.

* * *

పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా బెట్టుగా రెండు టరములు పూర్తిజేసిన శ్రీ కె.వి. రమణయ్య కుమార్తె, చవటపాళెం – శ్రీ కుడితిపూడి మస్తాన్ నాయుడు మనుమరాలు పద్మజ; రాజంపేట కాలేజి లెక్చరర్ శ్రీ వెట్టం శ్రీరాములు నాయుడు కుమారుడు తులసీ వెంకట రామకుమార్–

రమణయ్య గారి కుమారుడు వెంకటేశ్; చిత్తూరు జిల్లా లక్ష్మీపురం కాలేజి లెక్చరరు శ్రీ పోలవరం నారాయణప్ప నాయుడు కుమార్తె గీతారాణి –

వివాహాలు 5 తేది దర్గామిట్ట శ్రీ వెంకటేశ్వర కస్తూర్బా కళాక్షేత్రంలో జరిగాయి.

* * *

క్రిమినల్ లాయరుగా ప్రసిద్ధులైన శ్రీ ఎస్. రంగనాథం తనయుడు శ్రీనివాస్; హైదరాబాదు – పరిశ్రమల శాఖ అడిషనల్ డైరక్టరు శ్రీ ఎమ్. భాస్కర రావు తనయ సుజాత కళ్యాణం 5 తేది నాంపల్లి ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగింది.

ఈ సందర్భంలో శ్రీ రంగనాథం 9 తేది నెల్లూరులో కమ్మని విందు చేశారు.

* * *

అల్లూరు నుండి బెంగుళూరుకు పోయి హోటల్ అశోక్ అధిపతిగా స్థిరపడడమే కాక, ఇతర విధాల వ్యాపార విస్తరణలతో వృద్ధికి వచ్చిన నిగర్వి శ్రీ నలగట్ల కృష్ణారెడ్డి పుత్రుడు మోహన్; నిడిగుంటపాళెం – శ్రీ ఎన్. వెంకట రమణారెడ్డి పుత్రిక రూప పరిణయం 6 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

* * *

రైల్వే ఇంజనీరుగా దేశ విదేశాలలో ఖ్యాతి గడించి, సౌత్ సెంట్రల్ రైల్వే విజయవాడ డివిజనల్ మేనేజరుగా పనిజేసి హైదరాబాదులో స్థిరపడిన నెల్లూరీయుడు శ్రీ డి.ఎస్. రావు కుమారుడు, ఇంజనీరింగు రంగంలోనే అమెరికాలో వున్న శేషశాయి; బెంగుళూరు – శ్రీ హెచ్.జి. సూర్యకుమార్ కుమార్తె సుచరిత వివాహం 5 తేది బెంగుళూరు జయనగర్‌లోని కుచమాంబ కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

శ్రీ అత్తివరపు రామచంద్రారెడ్డి తనయ – అంటె మాదరాజు గూడూరు శ్రీ అత్తివరపు సుబ్బారెడ్డి మనుమరాలు, కీ.శే. గునుపాటి సుబ్బరామరెడ్డి గారి దౌహిత్రి – శ్వేత ఎం.ఎ; మద్రాసు శ్రీ పి. సుగుణాకర రెడ్డి తనయుడు అమరనాథ్ బి.టెక్., వివాహం 7 తేది మద్రాసు మార్షల్ రోడ్డులోని రాణిమెయ్యమ్మాళ్ హాలులో జరిగింది.

* * *

నెల్లూరు – శ్రీ తూపిలి వెంకయ్య నాయుడు కుమార్తె సునంద; తెల్లబాడు – శ్రీ జోపల్లి సుబ్బనాయుడు కుమారుడు ప్రభాకర రావు పెండ్లి 7 తేది వింజమూరులో జరిగింది.

* * *

అల్లూరు – శ్రీ దొడ్ల సుబ్బారెడ్డి పుత్రుడు పట్టాభిరామరెడ్డి; కావలి – శ్రీ వై. వెంకట సుబ్బారెడ్డి కుమార్తె కిరణ్మయి వివాహం 7 తేది నెల్లూరు అనితా థియేటర్‌లో జరిగింది.

* * *

విడవలూరు రైతు; నెల్లూరు సుప్రసిద్ధ న్యాయవాది, వి.ఆర్. కాలేజి కరస్పాండెంటు శ్రీ మేనకూరు ఆదిశేషారెడ్డి కుమారుడు, ఉపలోకాయుక్త శ్రీ మేనకూరు మోహన రామరెడ్డి అన్న, నిమ్మపటి శ్రీ వెంకట రమణారెడ్డి కుమారుడు వెంకట రామరెడ్డి; కోవూరు – శ్రీ డి. ఆదినారాయణ రెడ్డి కుమార్తె పద్మప్రియ పరిణయం 7 తేది తిరుపతి ఊర్వశి హోటల్ రాజరాజేశ్వరి కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

నెల్లూరు – మాట మర్యాద గలిగిన ప్రెస్ వర్కరు శ్రీ గళ్ల సుబ్బారావు కుమార్తె సుభాషిణి; ఇందుకూరు పేట – శ్రీ భాగవతుల శేషయ్య కుమారుడు సురేష్ బాబు పెండ్లి 8 తేది నవాబు పేట టి.వి.ఎస్. గరల్స్ హై స్కూల్ భవనంలో జరిగింది.

* * *

అనుభవజ్ఞుడు, సమర్థుడైన సర్జను డాక్టర్ యర్రంరెడ్డి ఈశ్వరరెడ్డి – డాక్టర్ శ్రీమతి భ్రమరాంబల పుత్రిక డాక్టర్ ప్రతిమ ఎం.బి.బి.ఎస్.; నెల్లూరు బస్ ఓనరు శ్రీ గూడూరు సుబ్బారెడ్డి (బుజ్జిరెడ్డి) కుమారుడు డాక్టర్ సురేష్ రెడ్డి (ఎం.ఎస్., ఎబిబి ఎంఎస్) వివాహం 9 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

* * *

ఓజిలి సర్పంచ్ శ్రీ వి.ఎస్. ప్రకాశ రావు కుమారుడు మురళీధర్ రావు బి.కాం., పులివెందుల పాలిటెక్నిక్‌లో లెక్చరర్‌గా వున్న గంగపట్నం స్వగ్రామీయుడు శ్రీ కె. మాధవరావు కుమార్తె మల్లిక పరిణయం 12 తేది నెల్లూరు దర్గామిట్ట శ్రీ రాజరాజేశ్వరి కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

హాస్టల్ వసతి తోటి నెల్లూరులో పబ్లిక్ స్కూళ్ల స్థాపనలో తొలి రోజుల వాడని చెప్పదగిన వుత్సాహి, సింహపురి పబ్లిక్ స్కూలు నిర్వాహకుడు శ్రీ ఎం.ఎస్. రాజు కుమార్తె చందన; నిండలి – శ్రీ వెంకట సుబ్బరాజు కుమారుడు డాక్టర్ కె.ఎస్. రాజు ఎం.డి. వివాహం 13 తేది నెల్లూరు టవున్ హాలులో జరిగింది.

* * *

ప్రెస్ కంపోజిటర్‌గా ఏ అరవై ఏళ్లకు ముందో జీవితాన్ని ప్రారంభించి, బాలాజీ ప్రింటర్స్‌కు యజమానియై, పాత విలువలకు ప్రతీకగా వున్న సౌమ్యతముడు శ్రీ ఆర్. బాలాజీ సింగ్ మనుమరాలు, శ్రీ గణేష్ సింగ్ పుత్రిక ఉష; నెల్లూరు – శ్రీ టి. బాలాజీ సింగ్ పుత్రుడు నారాయణ సింగ్ వివాహం 14 తేది గూడూరు వాసవి కన్యకాపరమేశ్వరి కళ్యాణమండపంలో జరిగింది.

* * *

దామెగుంట – శ్రీ దాసు సుబ్బరామయ్య కుమారుడు, న్యాయశాస్త్ర పట్టభద్రుడు గురుకుమార్; సమాచార శాఖ రేడియో డివిజనల్ ఇంజనీరు శ్రీ సిదాబత్తిన ప్రసాదరావు కుమార్తె, కామర్స్ గ్రాడ్యుయేటు తనూజ కళ్యాణం 14 తేది నెల్లూరు ఏనుగ సుందరరామిరెడ్డి రోటరీ ఆడిటోరియంలో జరిగింది.

* * *

నెల్లూరు రైస్ మిల్లరు, ప్రముఖ ధాన్యం వ్యాపారి శ్రీ రాజా హజరత్తయ్య పుత్రిక వేణుమాధవి; మద్రాసు – శ్రీ గుండా చంద్రశేఖర్ రావు కుమారుడు, రవి ఫైనాన్స్, మద్రాసు ధర్మ సంస్థ చిట్ ఫండ్స్ భాగస్తుడు నరేంద్ర కుమార్ వివాహం 14 తేది శెట్టిగుంట రోడ్డులోని రాజా వెంకట శేషయ్య శెట్టి రైస్ మిల్లులో జరిగింది.

* * *

ధనాఢ్యులైన గునుపాటి రెండవతరం సోదర శ్రేణిలో అగ్రజుడు, కొత్తూరు కీ.శే. గునుపాటి సుబ్బారామరెడ్డి గారి రెండవ కుమారుడు; నోవోహాస్, కృష్ణ ఒబ్రాయ్ వంటి సంస్థల ద్వారా పారిశ్రామికుడుగా అమెరికా వంటి దేశాలను కూడా ఎగబ్రాకిన చైతన్య స్రవంతి, పెద్ద మనిషి శ్రీ టి.వి. కృష్ణారెడ్డి తమ్ముడు, పద్ధతైన వ్యక్తి శ్రీ గునుపాటి జనార్ధన రెడ్డి కుమారుడు రామచైతన్య రెడ్డి; మద్రాసులో స్థిరపడిన నెల్లూరీయుడు, ప్రసిద్ధరైతు కుటుంబీకుడు, మైకామైనరు స్వర్గీయ సిద్ధ వరపు నారాయణ రెడ్డి గారి కుమారుడు; అంతస్తు ఆకాశానికి తాకినా తాను మాత్రం నేల మీదనే వున్న ఒడిదుడుకులు మార్పులులేని సంపన్నుడు శ్రీ నాయుడు దశరథ రామరెడ్డి మేనల్లుడు – అల్లుడు, సౌజన్యుడు అయిన శ్రీ ఎస్. శివకుమార్ రెడ్డి తనయ అజిత పాణిగ్రహణం 13 తేది సికిందరబాదులోని శ్రీమతి జాలూరి వజ్రమ్మ కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

విడవలూరు – శ్రీ జలదంకి శేషయ్య నాయుడు పుత్రుడు శ్రీనివాసులు, వెంకటగిరి – శ్రీ వేముల వెంకట సుబ్బనాయుడు పుత్రిక రమ్య. వివాహం 14 తేది వెంకటగిరి వెంకటేశ్వర కళ్యాణమండపంలో జరిగింది.

* * *

బస్ యాజమాన్యం నుండే గాక రాజకీయాల నుండి కూడా తెరమరుగై, కాంట్రాక్టు వృత్తిలో నెల్లూరుకు దూరంగా కేంద్రీకృతుడై వున్న శ్రీ కలవకూరు వెంకట రమణారెడ్డి (బాబు) కుమారుడు భాను ప్రతాప్; గంగపట్నం – శ్రీ కొండూరు శంకరరెడ్డి కుమార్తె నిఖిల పరిణయం 14 తేది టవున్ హాలులో జరిగింది.

కళ్యాణ వేదిక టవున్ హాలు; భోజనపు పెండ్లి – అనాదిగా వస్తున్న కె.వి.ఆర్. వారి సాంప్రదాయాన్ని బాబు కూడా అక్షరాలా అనుసరించాడు!

* * *

నాయుడుపేట మండలాధ్యక్షుడు, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ చదలవాడ కృష్ణమూర్తి అన్న, గూడూరు కాంగ్రెస్ రాజకీయాలలో యాదవ వర్గనాయకుడు శ్రీ చదలవాడ వెంకటేశ్వర్లు తనయ, విద్యావతి రమాదేవి ఎం.ఎ.; తిరుపతి శ్రీ ఎ. చంద్రశేఖర్ కుమారుడు గౌతమ్ శ్రీనివాస్ ఐ.ఆర్.ఇస్.ఇ పరిణయం 14 తేది తిరుపతిలోని వి.ఎం.కె. కళ్యాణ మండపంలో జరిగినది.

* * *

ఏ పనిలోనైనా సంపూర్ణత సమగ్రత విశిష్టతల కోసం ఎంత వ్యయ ప్రయాసలకైనా వెనుదీయని పట్టుదలగల వ్యక్తి; చేపలు రొయ్యల పెంపకం కృషిలో ఆరితేరినవాడు, ముగ్గురు ఇంజనీరింగు పట్టభద్రుల తండ్రి, సరస సద్గుణశీలి శ్రీ సామంతు గోపాలరెడ్డి కుమారుడు శివకుమార్‌రెడ్డి ; పడుగుపాడు-శ్రీ కాటంరెడ్డి చంద్రశేఖరరెడ్డితనయ, అంటే కోవూరు సమితి అధ్యక్షుడుగా క్లీన్‌చిట్ సంపాయించుకున్న ఆత్మాభిమానం అధికంగా గలిగిన మిత్రుడు శ్రీ కాటంరెడ్డి వెంకట రామరెడ్డి తమ్ముడు కుమార్తె సరస్వతి వివాహం 15 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

* * *

నెల్లూరు మునిసిపాలిటి రెవిన్యూ ఆఫీసరు శ్రీఎమ్ కృష్ణసింగ్ కుమార్తె

కొరవ 10 పేజీలో

